బాలానంద బొమ్మల

# టిప్పు సుల్తాన్



రచన:

రెంటాల గోపాలకృష్ణ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ ........................ విజయవాడ-2

టిప్పుసుల్తాన్

రచన :

రెంటాల గోపాలకృష్ణ

ముద్రణ :

మార్చి-1993

ముఖచిత్రం :

వి. యస్. ప్రకాష్

వెల : రు. 15-00

ముద్రణ :

డి. బి. ప్రింటర్స్,

విజయవాడ-2.

# ముందుమాట

టిప్పుసుల్తాన్ పరిపాలనా కాలం చాలా స్వల్పమైనది. కాని అది ఎంతో సంఘటనాత్మకమైనది. ఆ కొద్దికాలమే భారతదేశ చరిత్రలో యెంతో ప్రాముఖ్యం వహించింది. టిప్పు కాలంలో అనేక ముఖ్యమయిన సంఘటనలు జరిగాయి ఎన్నెన్నో విధాల. అవన్నీకూడా యెంతో గణనీయమైనవి.

ప్రధానంగా చెప్పాలంటే ఇంగ్లీషువారు టిప్పుసుల్తాన్‌లాంటి ప్రబలమైన, అజేయుడయిన శత్రువును అంతకు ముందెన్నడూ యెదుర్కొని వుండరు. టిప్పు బ్రిటిష్‌వారిని భారతదేశమునుండి తరిమివేయటానికి యెంతో భయంకరంగా పెద్దపులిలా పోరాడాడు. ఆ పోరాటం నిరంతరం కొనసాగించాడు. ఎలాగయినా సరే ఇంగ్లీషువారు ఇండియాలో వుండరాదన్నదే అతని లక్ష్యం. అందుకోసం ఆఖరుకతను తన ప్రాణాల్నే పణంగా ఒడ్డాడు. నక్కలాగా వందేళ్ళు జీవించడం కంటే సింహంలాగా ఒక్కరోజు బ్రతికితే చాలని టిప్పు అటుండేవాడు. అనటమేకాదు ఆ మాటను అమలు పరచి చూపాడుకూడా.

తన ఆదర్శాల విషయంలో టిప్పు ఎప్పుడూ రాజీ పడలేదు. అలాగే తన గమ్యంనుంచి పక్కకి తప్పుకోలేదు. విదేశీయుల ప్రాబల్యానికి, అధికారానికి ఏనాడూ తల ఒగ్గలేదు. అయితే దురదృష్టవశాత్తు భారతీయ ప్రభువుల మధ్య అనైక్యత నెలకొనటం, సైనికంగాను, రాజకీయంగాను మంత్రాంగం సాగించడంలో ఇంగ్లీషువారు ఎంతో చాతుర్యాన్ని ప్రకటించి ఆ ధర్మాన్ని సాధించటమే చివరకు వారు భారతదేశాన్ని తమ అధీనంలోకి తీసుకోవడానికి కారణమయింది. విదేశీయుల ప్రాబల్యం వలన, వారి కుతంత్రాలవలన భారతదేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పెద్ద ప్రమాదం సంభవించబోతున్నట్లు ఏనాడో టిప్పు పసిగట్టాడు. అందుకే అతను బ్రిటీషు వారిని ప్రతిఘటించడం జరిగింది.

మరొక ముఖ్యమయిన విషయంకూడా అతనిపరిపాలనా కాలంలోవుంది. అది అతని స్వీయపాత్ర. టిప్పు గుణగణాలు ఎన్నో విధాల ప్రశంసనీయమైనవి. అమిత ఉత్సాహంతోను, శక్తి సామర్థ్యాలతోను, జనరంజకముగా పరిపాలన సాగించాడతను. తండ్రి హైదరాలీకన్న టిప్పు ధైర్య సాహసాలను కార్యసూర తను ప్రదర్శించాడు. తన పరిపాలనా కాలంలో ఎన్నెన్నో యుద్ధాలు, ఎన్నెన్నో రాజకీయ కార్యకలాపాలు, సాగుతున్నప్పటికీ, ఎప్పుడూ అతడు ప్రజా సంక్షే మాన్ని గూర్చి మర్చిపోలేదు. అలాగే వారి అభ్యున్నతికి అవసరమయిన వ్యవ సాయం, వర్తక వాణిజ్యాలు, పరిశ్రమలూ ఇలాంటి వాటినన్నింటిని ఏమాత్రం నిర్లక్ష్యం చెయ్యలేదు. భారతదేశంలో పరిపాలనా వ్యవహారాలను, ప్రభుత్వ యంత్రాంగంలోను, పాశ్చాత్య ప్రక్రియలను మొట్టమొదటిసారిగా ప్రవేశపెట్టిన దాదాపు తొలి భారతీయ ప్రభువుగా టిప్పు గణుతికెక్కాడు. సృజనాత్మకంగా చొరవ తీసుకొని ఎన్నో ప్రయోగాలు చేసాడతను. ముఖ్యంగా మైసూరును కీలక మయిన వాణిజ్య విభాగాన్ని ఏర్పాటు చేసిన కీర్తికూడా అతనికే దక్కింది. రాష్ట్రంలోని సుదూరంగా వున్న వివిధప్రాంతాలలో కర్మాగారాలు స్థాపించాడు. అదేవిధంగా తుపాకులు మొదలయినవి తయారు చేయటానికి వృత్తి పనివారిని సేకరించగలిగాడు. నౌకాదళాన్ని నిర్మించడంలోనూ, న్యాయవ్యవస్థ విషయం లోనూ క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టాడు. నాణాలు ముద్రించటంలోనూ, పంచాం గాన్ని సవరించటంలోనూ అగ్రగణ్యుడుగా వున్నాడు.

భారతదేశంలో ప్రజలకు ప్రధాన వృత్తిఅయిన వ్యవసాయాన్ని అత నెంతమాత్రం విస్మరించక తాను శాయశక్తులా కృషిచేశాడు టిప్పుసుల్తాను. 18వ శతాబ్దం భారతదేశంలోని రాష్ట్రాలలో మైసూరు ఎంతగానో అభివృద్ధిని సాధించి సర్వవిధాలా సుసంపన్నమయిన రాష్ట్రంగా శోభిల్లింది.

***

# టిప్పు సుల్తాన్

## 1. పూర్వరంగం :- హైదరాలీ !

భారతదేశంలో 18వ శతాబ్దం మధ్యకాలం చాలా గందరగోళంగా వుంది. రాజకీయ పరిస్థితులు అస్తవ్యస్తంగా వున్నాయి. ముఖ్యంగా దక్షిణాదిన పరిస్థితులలో అనూహ్యమైన పరిణామాలు సంభవించాయి.

మైసూరు రాష్ట్రంలో అధికారంలో వున్న హైదరాలీ మరణించడంతో అతని కుమారుడు టిప్పుసుల్తాన్ రంగం మీదకు వచ్చాడు. ఆ సమయంలో తూర్పు యిండియా కంపెనీ పేరున వర్తకం కోసం వచ్చిన ఆంగ్లేయులు క్రమ క్రమంగా అధికారాన్ని హస్తగతం చేసుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తు న్నారు. మరో వంక స్వదేశీ రాజుల మధ్య వైరుధ్యాలు, అంతఃకలహాలు తల యెత్తాయి. ఇలాంటి పరిస్థితిలో, చిన్న రాష్ట్రమైన మైసూరు (ఇప్పటి కర్నాటక) ప్రముఖపాత్ర వహించింది. అధికారంలోకి వచ్చిన టిప్పుసుల్తాన్ మహావీరుడు. అరివీర భయంకరుడు. అంతేకాదు అకలంక దేశభక్తుడు కూడ. అతడు ప్రధా నంగా విదేశీయుల ఆధిపత్యాన్ని, ప్రభుత్వం స్వాధీనపరచుకునాలనే ప్రయత్నా

లను తీవ్రంగా ప్రతిఘటించాడు. ఆ విధంగా టిప్పు ఆంగ్లేయులతో యుద్ధాలు ప్రారంభించవలసి వచ్చింది.

అసలు మొదట హైదరాలీ 1760లో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడటం ప్రారంభించాడు. ఆ యుద్ధం 1799లో టిప్పుసుల్తాన్ పతనంతో అంతమయింది. హైదరాలీ నాయకత్వాన మైసూరు సేనలు అద్భుతమైన యుద్ధ నైపుణ్యం కలవని ఋజువు చేశాయి. యూరపు సేనల ప్రాబల్యం, నైపుణ్యం— ఋవేపీ కూడా మైసూరు సేనల వీర విక్రమం ముందు పనిచేయలేదు.



మైసూర్ అశ్వికదళం అత్యాశ్చర్యకరంగా వుంది. అశ్వాలు కోటగోడల పైనుంచి దూకుతూ వచ్చాయి,

అలగ్జాండర్ డౌ తన చరిత్రలో యిలా వ్రాశాడు :- "మైసూరు ఆశ్విక దళం అత్యాశ్చర్యాకరంగా వుంది. ఆ అశ్వాలు రెక్కలున్నట్లుగా కోట

గోడల పైనుంచి దూకుతూ వచ్చాయి. అశ్వికులు అవక్ర విక్రమంతో శత్రు సేనలపై పడి చీల్చి చెండాడుతూ వచ్చారు."

హైదరాలీ మరణానంతరం అధికారంలోనికి వచ్చిన అతని కుమార్డు టిప్పు తమ సైన్యాన్ని యింకా ఎంతగానో అభివృద్ధి చేశాడు. అంతేగాక బాహ్య ప్రపంచంతో కూడా సన్నిహిత సంబంధాలు పెట్టుకున్నాడు. ముఖ్యంగా బ్రిటిష్ ఆధిపత్యాన్ని రూపుమాపేటందుకు నిరంతరం ప్రతిఘటిస్తూ రావటమే తమ విధానంగా పెట్టుకున్న ఫ్రెంచివారితో సంబంధ బాంధవ్యాలు మరింతగా బలపరచుకున్నాడు. హైదరాలీ అధికారంలోకి వచ్చే సమయానికి మైసూరు దక్షిణ భారతంలో మారుమూల గల చిన్న రాష్ట్రం. అయితే 1761లో మూడవ పానిపట్టు యుద్ధం తర్వాత మరాఠాలు దక్షిణాదిపై అత్యంత శ్రద్ధాశక్తులు చూపటం ప్రారంభించారు. అందుచేత మైసూరు సైనిక చర్యలకు ఆలవాలమైపోయింది.

నైజాంలాగానే ఫ్రెంచి, బ్రిటిష్‌వారు కూడా యీ ప్రాంతపు రాజకీయాలలో ఒక క్రొత్త విధానాన్ని ప్రవేశపెట్టారు. ఆ కారణంగా అధికార సమతుల్యం పూర్తిగా తారుమారయిపోయింది. ముఖ్యంగా హైదరాలీ 1762 లగాయతూ 1778 వరకు, యిరుగు పొరుగున వున్న మహారాష్ట్రుల దాడి నుంచి తమ రాష్ట్రాన్ని పరిరక్షించుకోవటమే ప్రధాన విధానంగా పెట్టుకున్నాడు.

అతని రాజకీయ చతురత కారణంగా పరిస్థితులన్నీ అతనికి అనుకూలంగా పరిణమిస్తూ వచ్చాయి. ఉదాహరణకు 1766 లో మహారాష్ట్రులు, నైజాము, ఇంగ్లీషువారు సంయుక్తంగా మైసూరుపై దాడి చేసినప్పటికీ హైదర్ చాకచక్యంగా ప్రతిఘటించగలిగాడు. ఈ ప్రతిఘటన ఇంగ్లీషువారి అవకాశాలను తీవ్రంగా దెబ్బతీసింది. హైదర్ మొదట మహారాష్ట్రులు పోటీనుంచి తప్పుకునేటట్లు చేయగలిగాడు. ఆ తర్వాత నైజామును లోంగదీసుకున్నాడు. ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా పోరాటానికి వారు సంసిద్ధులయ్యేటట్లు చెయ్యగలిగాడు. ఆ విధంగా ప్రథమ మైసూరు యుద్ధం 2 సంవత్సరాలపాటు కొనసాగి తుదకు

మైసూరుకు అనుకూలంగా పరిసమాప్తమయింది. భారతదేశంలో ఇంగ్లీషువారు సాగించిన యుద్ధాలన్నిటిలోకి యిది అత్యంత విధ్వంసకరమైనది. భారతీయ బలగం ముందు బ్రిటిష్‌వారి పేరు ప్రతిష్టలు యెంతగానో దెబ్బతిన్నాయి. ఆ విధంగా మద్రాసు సింహద్వారాలు తెరవటానికి అనూహ్యమైన షరతులకు ఆంగ్లేయులు లొంగిపోవలసి వచ్చింది. ఈ యుద్ధంలో మద్రాసు ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమయింది. వారి బ్రహ్మాండమయిన పథకాలు సైన్యం ధైర్య స్థయిర్యాలు ఎంతగానో కూలిపోయాయి.



హైదర్ మహారాష్ట్రంతో మహారాష్ట్రుల పోటీ నుంచి తప్పుకునేటట్లు చేయగలిగాడు

అజేయంగా వుంటూ వచ్చిన బ్రిటిష్ ఆధిపత్యాన్ని దెబ్బతీసి, భారతీ అధికారాలను ప్రమలం చేయటంలో హైదరాలీ విజయం సాధించాడు. సెయి థామస్, ఆర్నీ, కావేరీ పాక్, ప్లాసీ, మచిలీపట్నం, బక్సార్ మున్నగు

లన్నీ యూరోపియన్లకు అనుకూలంగా వుంటూ వచ్చాయి. కాని యీ యుద్ధం మాత్రం అసాధారణమై, బ్రిటిష్‌వారి పరిస్థితుల్ని తారుమారు చేయగలిగింది.

ఈ యుద్ధం తర్వాత 1770లో మహారాష్ట్రులు మళ్ళీ మైసూరుపై దాడి చేశారు. అప్పుడు హైదరాలీ బ్రిటిష్‌వారి మద్దతు కోరాడు. తత్ఫలితంగానే మద్రాసు సంధి ఏర్పాటయింది. దాని ప్రకారం ఆంగ్లేయులు మైసూరుకు సహాయ పడాలి. కాని హైదర్ పదే పదే విజ్ఞప్తులు చేసినప్పటికీ, బ్రిటిష్‌వారు వాటిని



మద్రాసులోని బ్రిటిష్ ప్రతినిధి మహారాష్ట్రులతో కలసి హైదరాలీని దెబ్బతీయటానికి ప్రయత్నించాడు.

లక్ష్యపెట్టలేదు. ఆ కారణంగానే 1771 మార్చిలో శ్రీరంగపట్నం సమీపంలో చింకురావి వద్ద జరిగిన సమరంలో మహారాష్ట్రుల చేతుల్లో హైదరాలీ తీవ్ర పరాజయాన్ని ఎదుర్కోవలసివచ్చింది. వారు కర్నాటకం నవాబు ఒత్తిడికి లొంగి

పోయారు. మద్రాసులో బ్రిటిష్ ప్రతినిధి, అటు మహారాష్ట్రులు కలిసి సంయుక్తంగా హైదరాలీని దెబ్బతీయటానికి ప్రయత్నించారు. ఈ విధంగా ఆంగ్లేయులు నమ్మకద్రోహానికి పాల్పడ్డారన్నమాట. అయితే ఆ తర్వాత కొద్ది సంవత్సరాలకే వారు దానికి తగిన మూల్యం చెల్లించాల్సి వచ్చింది. 1780లో హైదరాలీ కర్నాటకపై దాడిచేసి, వారిపై చావుదెబ్బ తీశాడు.

ఆ సంవత్సరంలోనే ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నైజాం, నానా, సింధియా, భోన్స్లే, హైదర్ వీరంతా కలసి భారతదేశంలో బ్రిటిష్ స్థావరాలపై దాడి చేయాలన్న అంగీకారానికి వచ్చారు. ఈ కారణంగా మద్రాసుకు ఎంతగానో యిబ్బంది కలిగింది. ఒక వారంరోజులు లోపుగానే కంజీవరాన్ని విధ్వంసం చేసి సోవోరేవు వరకు చొచ్చుకొని పోగలిగారు. పొలిలూరు వద్ద గొప్ప సమరం జరిగింది. ఆ యుద్ధంలో కర్నల్ బెయిలీ పూర్తిగా పరాజితుడయినాడు. మద్రాసు రాష్ట్రమంతటా అది యెంతో గందరగోళానికి దారితీసింది. బక్సారు యుద్ధం నాయకుడు, ఇంగ్లీషు సైన్యానికి కమాండరు అయిన సర్ హెక్టర్ మన్రో హైదరుకు వ్యతిరేకంగా ఆంగ్లసేనల్ని నడిపించాడు. అయితే అతడు మద్రాసు వద్దనే వెనుతిరగవలసి వచ్చింది. ఆ పోరాటంలో 500 మంది బ్రిటిష్ సైనికులు దుర్మరణం పాలయినారు. కొందరు గాయపడ్డారు కూడా. కంజీవరం తటాకంలో తమ తుపాకులన్నీ పారవైచి, సైన్యం వెనుతిరగవలసి వచ్చింది. హైదరును ఓడించినప్పుడు మాత్రమే తాము మద్రాసును సులభంగా చేజిక్కించుకోవచ్చునని సర్ ఐరీ కూటీ భావించాడు. ఇంగ్లీషువారు పరాజయం పొంది వెనుతిరిగి రావటం వారి గౌరవ ప్రతిష్టలకే భంగకరమయింది. ఆ తర్వాత బెంగాల్ నుంచి బ్రిటిష్‌వారికి యెంతగానో సహాయ సహకారాలు లభించాయి. ఆ కారణంగానే అటు పిమ్మట హైదరులో జరిగిన అనేక పోరాటాలలో ఆంగ్లేయులు విజయం సాధించగల్గారు. పరిస్థితులు మారిపోయాయి. అప్పటికే హైదరు కర్నాటకలో హెచ్చుభాగం తన అధీనంలో వుంచుకో గలిగాడు. అతని ధ్యేయమల్లా ఒక్కటే. ఆంగ్లేయులపై

అవిశ్రాంత పోరాటం జరిపి దేశం నుండి వారిని పారద్రోల అతని ఏకైక లక్ష్యం. అయితే మహారాష్ట్రులు ఇంగ్లీష్‌వారితో ప్రత్యేకంగా ఒక శాంతి ఒడంబడిక చేసుకున్నారు. ఇంతలోనే 1782 డిశంబరులో హైదరాలి మృతిచెందాడు.

ఏమయినా హైదరాలీ కాలంలో అతనివల్ల ఈస్టిండియా కంపెనీకి, బ్రిటిష్‌వారికి కలిగిన నష్టం యింతా అంతా కాదు. సింధియా శాంతి చేసుకోక తప్పలేదు. ఇక నైజాం ఏమాత్రం పట్టించుకోలేదు. వీటిని బట్టి చూస్తే వ్యక్తి



హైదర్ ధ్యేయమల్లా ఒకటే ఆంగ్లేయులపై అవిశ్రాంత పోరాటం జరిపి వారిని దేశం నుండి పారద్రోలటం

గత ద్వేషాలే వీరి మధ్య సర్వసాధారణమైనట్లు కన్పిస్తున్నది. ఆ ద్వేషాలు సమసిపోయిన వెంటనే అందరూ క్షుద్రరాజకీయాలవల్ల ఒకపైపోయారు. హైదరాలీ యుద్ధం మధ్యలో మరణించగా భారతీయుల ప్రాబల్యం తగ్గిపోయి, యూరో

పియన్‌ల ప్రాబల్యం పెరుగుతూ వచ్చింది. ఇదిలా వుండగా మహారాష్ట్రులు 'మైసూరులో తమకు సంభవించిన నష్టాలను ఎప్పుడెప్పుడు భర్తీ చేసుకుందామా' అని ఆరాటపడుతూ వచ్చారు.

## 2. అధికారంలో టిప్పుసుల్తాన్ - ఇంగ్లీష్ వారిపై పోరాటాల పరంపర!

హైదరాలీ మరణానంతరం అతని కుమారుడు టిప్పుసుల్తాన్ అధికారంలోకి వచ్చాడు. తండ్రి బాగానే యితడు మహావీరుడు. తండ్రిని మించిన తనయుడిగా ప్రసిద్ధిగాంచాడు. అంతేగాక ధైర్యసాహసాలకూ, సుస్థిర సంకల్పానికీ, పట్టుదలకూ టిప్పు మారుపేరు. అతడు 1750 నవంబరు 10వ తేదీన కోలార్ జిల్లాలోని దేవనహల్లీ అనే చోట జన్మించాడు. మహాత్ముడు టిప్పు మస్తాన్ అవుల్లా పేరు మీద యితనికి టిప్పు సుల్తాన్ అను పేరు పెట్టారు. మస్తాన్ దేల్యా గోరీ ఆర్కాట్‌లో వుంది. టిప్పు తల్లి పుత్రసంతానం కోసం పూర్వం అక్కడకు వెళ్ళి ప్రార్థింస్తుండేది అంతేగాక అతని తాతగారు ఫతే మహ్మద్ పేర యితన్ని ఫతే అలీ అని కూడా పిలిచేవారు.

తండ్రి హైదరాలీ వలెగాక టిప్పుసుల్తాన్ గొప్ప విద్వాంసుడు. అనేక భాషలలో పండితుడు. అంతేగాక యుద్ధతంత్రంలోను, పరిపాలనా వ్యవహారాల లోనూ యితను శిక్షణ పొందాడు. చిన్నతనంలోనే తండ్రి వెంట అనేక యుద్ధాలకు వెళ్ళి అనుభవం గడించాడు. టిప్పు మొదటి అనుభవం 1763లో హైదరాలీ మలబారుపై దాడి చేసినప్పుడు కలిగింది. అంతేకాకుండా మొదటి మైసూరు యుద్ధ కాలంలో టిప్పు నైజాంతో చాలా చాకచక్యంగా సంప్రదింపులు జరిపాడు. అప్పుడు నైజాం 'ఫతే అలీఖాన్' అని యితనికి బిరుదం యివ్వటం జరిగింది. ఆ యుద్ధం చివరి సమయంలో టిప్పు మద్రాసు వరకూ వెళ్ళి సెయింట్ థామస్ వద్ద గల మద్రాసు కౌన్సిలర్ల ఇళ్ళను దోచుకున్నాడు. 1769-1772 మధ్య

జరిగిన మైసూరు-మహారాష్ట్ర యుద్ధంలో కూడ టిప్పూ పాల్గొన్నాడు. రెండవ మైసూరు యుద్ధం తటస్థించినప్పుడు టిప్పు యుద్ధతంత్రంలోనూ, రాజతంత్రజ్ఞం లోనూ అపార అనుభవం గడించగలిగాడు. 1780 సెప్టెంబరులో కర్నల్ బెయిలీ తోను, 1782 ఫిబ్రవరిలో కర్నల్ బ్రెయిత్ వెయిట్ తోనూ జరిగిన పోరాటాలలో



టిప్పు తల్లి పుత్రసంతానం కోసం దేవుని ప్రార్థించుట

వారిని తీవ్రమైన దెబ్బతీయగలిగాడు. హైదర్ మరణించిన సమయంలో టిప్పు మలబారు తీరంలో గల కర్నల్ అంబర్‌స్టన్‌కు వ్యతిరేకంగా కార్యక్రమాలు సాగించటంలో నిమగ్నుడయి వున్నాడు.

టిప్పుసుల్తాన్ అధికారాన్ని చేబట్టడం యెంతో శాంతియుతంగా జరిగి పోయింది. తండ్రి తర్వాత వారసత్వం రీత్యా అతనికి సంక్రమించిన రాజ్యమిది. టిప్పు తన రాజ్యాన్ని ఉత్తరాన్న కృష్ణానదినుంచి, దక్షిణాన్న దిండిగల్‌వరకు

అంటే షుమారు 400 మైళ్ళ పొడవున తన రాజ్యాన్ని విస్తరించ గల్గాడు. అల్లాగే పశ్చిమాన్న మలబార్ నుంచి, తూర్పున తూర్పు కనుమల వరకూ అంటే షుమారు 300 మైళ్ళు అవిచ్ఛినంగా తన పరిపాలనను సాగించగలిగాడు.



టిప్పుసుల్తాన్ అధికారాన్ని చేపట్టటం ఎంతో శాంతియుతంగా జరిగిపోయింది

కాని అతని సుదీర్ఘ సామ్రాజ్యానికి సుస్థిరత, భద్రతా లేకుండా పోయాయి. ఇరుగు పొరుగు రాజ్యాలవారు అసూయా ద్వేషాలతో టిప్పు ప్రాబల్యాన్ని చూసి సహించలేకపోవటమే దీనికి కారణం. టిప్పుకు వ్యతిరేకంగా అనేక కుట్రలూ, కుతంత్రాలు సాగుతూ వచ్చాయి. మహారాష్ట్రిలంతా యేకమైనారు. ఇంగ్లీషు వాళ్ళు సరే సరి. వారి ఎత్తుగడలకు ఈ స్వదేశీ ప్రభువులు తల వొగ్గవలసి వచ్చింది. ఆ విధంగా టిప్పుసుల్తాన్‌పై అందరూ యేకమై దెబ్బతీయటానికి పొంచి వున్నారు. ఇంగ్లీషువారి సహాయ సహకారాలతో టిప్పును పడగొట్టడానికి

మైసూరు మహరాణి కూడ తగు విధంగా తోడ్పడింది. దక్షిణాది నుంచి శ్రీరంగ పట్టణానికి బ్రిటీష్‌వారు కర్నల్‌ఫుల్లర్‌టన్ నాయకత్వాన ముందుకు సాగిపోయారు.

ఇదిలా వుండగా మలబార్‌లోని ప్రధాన పాలెగాండ్రందరూ టిప్పుపై తిరుగుబాటు చెయ్యటానికి ఆంగ్లేయులు ప్రోత్సహించటంతో టిప్పు మరిన్ని కష్టాల్ని యెదుర్కోవలసి వచ్చింది.



టిప్పు ఇంగ్లీషు వారితో పోరాడి వారు సంధి చేసుకునేటట్లు చేయగలిగాడు

అయినప్పటికి టిప్పు ఈ పరిస్థితిని యావత్తూ యెంతో సమర్థతలోనూ చాకచక్యంతోనూ యెదుర్కొన్నాడు. బాహ్యశత్రువునేగాక అంతరంగికంగా తల యెత్తిన విరోధ వర్గాన్ని కూడ దెబ్బతీసి, వారిని ఓడించగల్గాడు. కాగా ఇంగ్లీషువారితో అత్యంత తీవ్రంగా పోరాడి, వారు సంధి చేసుకునేటట్లుగా చేయ గల్గాడు. కొద్దికాలంలోనే అదృష్టవశాత్తు జరిగిన సంఘనలు, టిప్పుకు అను

కూలంగా పరిణమించాయి సర్ ఐర్‌కూటే 1783 ఏప్రిల్ 27న మరణించాడు. అంతకుముందు 1783 మార్చిలో ఫ్రెంచిమాకండర్ బుస్సీ 27 నౌకలను 5000 మంది సైనిక దళాలను భారత భూభాగంలోకి దించాడు. బెంగాల్‌నుండి ఇంగ్లీషు వారికి అందే సరఫరాలన్నిటినీ ఫ్రెంచి ఎడ్మిరల్ సఫ్రేన్ నిలుపుచేశాడు. మద్రాసు ఖజానా ఖాళీ అయిపోయింది. ఇంగ్లీషువారు నవాబుతో నిరంతర పోరాటం జరుప వలసి వచ్చింది. ఇలాంటి పరిస్థితిలో టిప్పు చాల త్వరలోనే కోలుకోగలిగాడు.

మద్రాసు ప్రభుత్వం యీశాన్యం నుండి దాడిచేసి కడప పట్టణాన్ని పట్టుకోవటానికి ప్రయత్నించారు. కాని టిప్పు ఆ ప్రయత్నాన్ని యెంతో వీరోచితంగా భగ్నం కావించాడు.

నంజరాజ ఒడయార్ సతీమణి, మైసూరు మహారాణీ అయినా లక్ష్మమ్మణి పన్నిన కుట్ర ఫలితంగా ఇది సంభవించింది. మైసూరు రాష్ట్రాన్ని తన రాజ వంశీయుల అధీనంలో వుంచుకోవటానికి ఇంగ్లీషు వారితో రహస్యంగా ఒక ఒప్పందం కుదుర్చుకుందామె. అంతేగాక, మైసూరును జయించటానికిగాను ఇంగ్లీషు వారికి మహారాణి ఆర్థిక సహాయం కూడ అందజేసింది కర్నల్‌లాంగ్ దక్షిణాది నుండి దాడిచేసి కరూరు, దిండిగల్లు, మరికొన్ని యితర కోటలను పట్టుకున్నాడు. తన అనుచరులే కుట్ర పన్నిన వారిలో వున్న విషయం కనుగొని టిప్పు వారిని తీవ్రంగా శిక్షించాడు. జనరల్ స్టూ ఆర్చర్ కడలూరువద్ద తనసేనతో ఆగిపోవలసి వచ్చింది. ఆ విధంగా మైసూరు మహారాణి ప్రయత్నం విఫలమైంది.

ఈలోగా ఇంగ్లండు, ఫ్రాంసుల మధ్య ఒక శాంతి ఒడంబడిక కుదిరినట్లు యూరప్ నుండి వార్త వచ్చింది. ఇది 1783, జూన్ 24న మద్రాసులో జరిగింది. ఇంగ్లీషువారు యుద్ధ విరమణ పాటించటానికై తొందరపడుతూ వచ్చారు. కడలూరులో వారి పరిస్థితి యేమాత్రం భద్రత లేకుండా వుండటమే దీనికి కారణం. టిప్పు సుల్తాన్ సేనలు ఫ్రెంచివారి సేనతో ఇంగ్లీషువారు లొంగిపోవటానికై ఒత్తిడిచేస్తూ వచ్చాయి. కాని ఇంగ్లీషు, ఫ్రెంచివారి మధ్య సంధి కుదుర్చుకున్నట్లు

వచ్చినవార్తతో పరిస్థితి యావత్తూ పూర్తిగా మారిపోయింది. బుస్సీ వెంటనే యుద్ధ విరమణకు సంసిద్ధుడైనాడు. అంతేగాక తను కూడ ప్రతీకార చర్యలు నిలుపవలసిందిగా టిప్పుపై ఒత్తిడి చేస్తూ వచ్చాడు.



మైసూర్‌ను జయించడానికి ఇంగ్లీషువారికి మహారాణి ఆర్థిక సహాయం కూడా అందజేసింది

ఇందుకు టిప్పు మొదట సందేహించాడు.

కాని తర్వాత ఫ్రెంచివారు పోటీలో వుండరని తెల్సుకొని మనసు మార్చుకున్నాడు. అతను 1783 ఆగష్టు 2న మంగుళూరు వద్ద సంధికి అంగీకరించాడు. దానితో ప్రాక్పశ్చిమ తీరాలనుండి సాగుతూ వచ్చిన ప్రతీకార చర్యలు ఆగిపోవలసి వచ్చింది.

ఇంగ్లీషువారు ఎప్పుడూ కూడ తాము చేసుకున్న శాంతి ఒడంబడికలకు కట్టుబడి వుండలేదు. తమ పరిస్థితులు కొంచెం మెరుగుపడిన వెంటనే దక్షిణాది

నుంచి క్రొత్తగా దాడులు చేయటం ప్రారంభించారు. కర్నల్ పుల్లిన్టన్ 1783 నవంబర్‌లో పాలఘాటు, కోయంబత్తూరులను పట్టులకున్నాడు. బొంబాయి ప్రభుత్వం తాలూకు జనరల్ మెక్లాడ్ మంగుళూరు సేనలకు కావలసిన ఆహార పదార్థాలు యావత్తూ అందిస్తూ వచ్చాడు. ఇది సైనిక ఒడింబడికకు పూర్తి విరుద్ధం. ఈ నమ్మక ద్రోహాన్ని టిప్పూ యేమాత్రం సహించలేకపోయాడు. 1784 జనవరి 29న బ్రిటిష్ సైనికదళం టిప్పుకు లొంగిపోక తప్పలేదు. మంగుళూరును పట్టుకోవటం టిప్పుకు గొప్ప లాభదాయకమయింది.



జనరల్ మెక్లాడ్ మంగుళూరు సేనలకు ఆహార పదార్థాలు యావత్తూ సప్లయిచేస్తూ వచ్చాడు

ఏమైనా ఫ్రెంచివారి ప్రవర్తన, వారి వైఖరీ టిప్పు సుల్తాన్‌కు ఎంతో ఆశ్చర్యం కలిగిస్తూ వచ్చింది. ఎంతోకాలంనుంచి బుస్సీ నాయకత్వంలో ఎన్నెన్నో హాసీలను పొందుతూ వచ్చిన భారతీయ అధికారులు, యూరప్‌లో సంధి జరిగిం

దన్న వార్త తెలుసుకొని నిర్ఘాంతపోయారు. ఆ విధంగా ఇండియాలో యుద్ధాల నుంచి, ఫ్రెంచివారు వుపసంహరించుకున్నారు. ఈ సంధివార్త వినగానే బుస్సీ టిప్పుతో సంప్రదించాడు. యుద్ధాలను విరమించవలసిందిగా ఒత్తిడిచేసాడు. నిజానికి బుస్సీ శాంతి కాముకుడుగా ప్రముఖ పాత్ర నిర్వహించటానికి ప్రయత్నిస్తూ వచ్చాడు. ఆ విధంగా తన గౌరవ ప్రతిష్ఠలను కాపాడుకోవాలని అతని వుద్దేశ్యం. 1783 ఆగష్టు 2న జరిగిన ఒడంబడిక ప్రకారం అతను ఆ లక్ష్యాన్ని నెరవేర్చుకో



తంజావూరు రాజా వకీలయిన శంభాజీని టిప్పుతో సంప్రదించడానికి నియమించాడు

గలిగాడు. తన ఏజెంట్లను యిటు టిప్పు వద్దకూ, అటు మద్రాసులోని ఇంగ్లీషువారి వద్దకు పంపాడు. కాని అతని మధ్యవర్తిత్వానికి అంగీకరించటానికి వీరుభయులు కూడ ఇష్టపడలేదు. ఆ విధంగా ఫ్రెంచి వారు ఇండియాలో అటు సైనికంగానూ

ఇటు రాజకీయ దౌత్యపరంగాను ఘోరంగా విఫలమయ్యారు. కనుకనే రెండవ మైసూరు యుద్ధంలో ఫ్రెంచివారు వహించిన పాత్ర ఎంతో అప్రతిష్టాకరమైంది.

ఇంగ్లీషువారు టిప్పుతో యెలాగయినా సంధి కుదుర్చుకోవటానికి ప్రయత్నం సాగించారు. వారి ఆర్థిక పరిస్థితులు ఛిన్నాభిన్నమైనాయి. బీదనూరు, మంగళూరు పోగొట్టుకొనటంతో వారి గౌరవ ప్రతిష్టలకు కూడా తీరని కళంకం వచ్చి పడింది. ఇక మద్రాసు గవర్నరు లార్డుమెకార్టినే టిప్పుతో సంధిచేసుకోవటానికి ముందుకు వచ్చాడు. 1783 ఫిబ్రవరిలో తంజావూరు రాజా వకీలయిన శంభాజీని టిప్పుతో సంప్రదించటానికి నియమించాడు. ఎవరి అధీనంలో వున్న ప్రదేశాలను వారు తిరిగి అప్పగించటానికి, వారి వారి స్వాధీనంలో గల ఖైదీలను తిరిగి పంపివేయటానికి అంగీకరించవలసిందిగా టిప్పును కోరారు. మద్రాసు ప్రభుత్వం కూడా టిప్పుతో సంధికి అనుకూలంగా వుంటూ వచ్చింది. అంతేగాక పుదుకోట్టై, మాల్పాడి, మైసూరు రాష్ట్ర సరిహద్దులో గల ఇతర ప్రదేశాలను స్వాధీన పర్చవలసిందిగా వారు టిప్పుకు కోరారు. బ్రిటిష్‌వారి తరపున వారన్ హేస్టింగ్జ్ తీవ్రమైన ప్రయత్నాలను సాగించాడు. ఏ విధంగానయినా శాంతిసాధన జరగాలని వాంఛించాడు. వివరాలు చర్చించటానికిగాను టిప్పు వద్దకు ఒకరిద్దరు కమీషనర్లను పంపటానికి కూడ బ్రిటిష్‌వారు అంగీకరించారు మెకార్టనే ఆంతరంగిక కార్యదర్శి 1783 నవంబరులో టిప్పు వద్దకు వెళ్ళాడు. కర్నాటకలో స్వాధీన పరచుకున్న ప్రదేశాలనుండి వైదొలగాలని ఖైదీలనందరినీ విడుదల చెయ్యాలని ప్రతిపాదించాడు. అయితే ఈ షరతులకు టిప్పు అంగీకరించలేదు. దిండిగల్లు, కన్ననూరు ఇంగ్లీషువారి చేతుల్లో వున్నంతవరకూ తాము ఏ ప్రదేశాలనుండి వైదొలగే ప్రసక్తిలేదని, అంబూరు సతాఘర్‌లను తాము వదలిపెట్టబోమని టిప్పు స్పష్టంచేశాడు. ఏమయితేనేం చివరకు ఉభయ పక్షాల వారూ తమ తమ అధీనంలోవి ఖైదీలను విడుదల చెయ్యటంతోనూ, తమ తమ స్వాధీనంలోగల స్థావరాలనుండి వైదొలగటంతోనూ పరిస్థితి

చక్కబడింది. 1784 మార్చి 11న ఒక సంధి పత్రంపై ఉభయులూ సంతకాలు చేసారు.

ఇండో-బ్రిటిష్ చరిత్రలో మంగుళూరు సంధి ఒక ముఖ్యమయిన పత్రం. ఆ విధంగా టిప్పు ఘన విజయాన్ని సాధించినట్లయింది. తన షరతలకు ఇంగ్లీషువారు అంగీకరించేటట్లు అతడు చేయగలిగాడు. అంతరంగికంగా కుట్రలూ



ఇండో-బ్రిటిష్ చరిత్రలో మంగుళూరు సంధి ఒక ముఖ్యమైన పత్రం

కుతంత్రాలు జరుగుతున్న సమయంలో, మరొకప్రక్క మహారాష్ట్రులు బ్రిటిష్ వారితో చేతులు కలపటానికి సిద్ధంగావున్న తరుణంలోనూ, ఫ్రెంచివారు పోటీ నుంచి ఉపసంహరించుకునేటట్లు చేయగలిగాడు టిప్పు. ఆ విధంగా భారతీయ అధికారులతో బ్రిటిష్ వారికి గల సంబంధాలన్నీ దెబ్బతిన్నాయి. బ్రిటిష్‌వారితో సాగిం

ఏిన సుదీర్ఘ పోరాటంలో టిప్పు అఖండ విజయం సాధించటమేగాక మాతృదేశం పట్ల అతనికి గల గౌరవ ప్రతిష్టలూ, భక్తి ప్రపత్తులూ ప్రస్ఫుటమైనాయి. ఈ మంగళూరు సంధి ఇంగ్లీషు వారు తటస్తంగా వుండిపోవటానికి, మహారాష్ట్రులతో చేతులు కలపకుండా నిరోధించటానికి యెంతగానో తోడ్పడిందని చెప్పవచ్చు.

టిప్పుసుల్తాన్ ఆంగ్లేయుల రాజ్య విస్తర కాంక్షపై చావు దెబ్బ తీసాడు. దేశంలో ప్రజలు అశాంతిగాను, యుద్ధాలతో గందరగోళ పరిస్థితులలోనూ



దేశంలో కరువు కాటకాలు ఖజానా కాళీగావుంది

వుండకుండా శాంతి సామరస్యాల సాధనకు నిరంతరం కృషిచేసినట్లు మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఆ కాలంలో దేశపరిస్థితులు కూడ యెంతో ఆందోళన కరంగా వుంటూ వచ్చాయి. అటు యేకాకిగా వున్న భారతదేశం, యిటు దేశంలో

కరువు కాటకాలు. ఖజానా ఖాళీగా వుంది. వరపతి సౌకర్యాలు పూర్తిగా అడుగంటి పోయాయి. పరిపాలనా యంత్రాంగం తాలూకు వ్యయం మోయలేని భారంగా వుంటూ వచ్చింది. వనరులు పూర్తిగా లోపించాయి. క్లిష్టమైన ఇలాంటి తరుణంలో దేశ ప్రజలలో శాంతి యెంతో అవసరం, వాంఛనీయం కూడ.

ఏమైనా యీ సంధి బ్రిటిష్‌వారిని యెంతో నిరాశా నిస్పృహలకు గురి చేసింది. వారన్ హేస్టింగ్జ్ తన పదవిని కోల్పోవలసి వచ్చింది. అతను యెంతో అవమానకరంగా స్వదేశానికి తిరుగు ముఖం పట్టాడు. అంతేకాదు. బ్రిటిష్‌వారి పేరు ప్రతిష్టలకు ఈ సంధి మరొక దెబ్బ.

ఆ విధంగా టిప్పుసుల్తాన్ తన పరిస్థితిని, అధికార ప్రాబల్యాన్ని సుస్థిరంగా నిలుపుకోగలిగాడు. ఆనాడు భారతదేశంలో ఒక ప్రభువు అటు బాహ్యం గాను, ఇటు అంతరంగికంగాను యెన్నో కష్టాలు, ఇబ్బందులు యెదుర్కొని, నిరంతరం యుద్ధాలతో సతమతమైపోతూ. తన రాజరికాన్ని నిలబెట్టుకోవటం యెంతో కష్టమైన పని. ఈ విధంగా టిప్పు భారత చరిత్రలో ఒక అసాధారణమైన వ్యక్తిగాను, అసహాయ శూరుడుగాను, విజ్ఞతా వివేకం గల గొప్ప రాజనీతిజ్ఞుడు గాను ప్రసిద్ధిగాంచాడు. టిప్పు యొక్క ఇతర గుణాలను గురించి, అతని పరి పాలనాదక్షతను గురించి వర్ణించాలంటే యెంతో పెద్ద గ్రంథమౌతుంది.

# 3. ఒకేసారి ఇద్దరి శత్రువులతో పోరాటం

రెండవ మైసూరు యుద్ధంతో టిప్పుసుల్తాన్ పేరు ప్రతిష్టలు ఇనుమడిం చాయి. ఇది ఇరుగు పొరుగు దేశాల వారికి అసూయా ద్వేషాలకు కారణ మయింది.

ముఖ్యంగా మంగుళూరు సంధి మహారాష్ట్రలో తీవ్రమైన అసం తృప్తిని రేకెత్తించింది. ఎందుచేతనంటే మధ్యవర్తులుగా వారు ఆశించిన ప్రయో జనం దక్కలేదు. వారెంతగానో నిరుత్సాహపడ్డారు. అంతేగాక వారు పోగొట్టు

కున్న మైసూరు ఉత్తర ప్రాంతాలను తిరిగిచేజిక్కించుకోవాలన్నఆశకూడా అడు గంటింది. కృష్ణా ప్రాంతంలో తమ భూభాగాలు నష్టపోయినందుకు మహారాష్ట్రులు అంతగా చింతించలేదు. హైదరాలీ మరణం తర్వాత కూడా నానా తమ భూభాగాన్ని దత్తం చేయవలసిందిగా గట్టిగా కోరాడు. ఇంగ్లీషువారితో చేతులు కలిపి బెదిరించాడు కూడ. హైదరు మరణం తర్వాత తమ లక్ష్య సాధనకు ఎప్పుడు



1783 అక్టోబరు 13న సింధియా ఇంగ్లీషువారి మధ్య ఒక ఒడంబడిక కుదిరింది

సమయం చిక్కుతుందా అని మహారాష్ట్రులు పొంచివున్నారు. అయితే టిప్పు యేమాత్రం లొంగలేదు. దానితో సింధియా ఇంగ్లీషువారితో చేతులు కలిపాడు. నానా ఆశీస్సులతో టిప్పుపై దెబ్బతీయాలని అతని ఆశయం. 1783 అక్టోబరు 13న సింధియా. ఇంగ్లీషువారి మధ్య ఒక ఒడంబడిక కుదిరింది. దీని ప్రకారం

కర్నాటక ప్రాంతాలను టిప్పు వొదులుకోవాలని, ఖైదీలను విడుదల చెయ్యాలని ఏర్పాటువుంది. ఇందుకు భిన్నంగా టిప్పు ప్రవర్తించేటట్టయితే, ఇంగ్లీషువారితో కలిసి మహారాష్ట్రులు టిప్పుసుల్తాన్‌పై యుద్ధం చెయ్యక తప్పదు అలాగే నిజాం కూడ తన ప్రయోజనాలకోసం టిప్పుపై యుద్ధం చెయ్యటానికి సిద్ధమయినాడు.

అయితే ఈలోగా మహారాష్ట్రుల పథకాలను కనిపెట్టి టిప్పు ఇంగ్లీష వారితో కలతలు పెంచుకోకుండా వూరుకున్నాడు. ఇందువల్ల మైసూరుతో మహారాష్ట్రి సంబంధాలు మరింతగా దెబ్బతిన్నాయి.

1761లో టిప్పు అధికారంలోకి వచ్చేలగాయతు నిజాము మైసూరు పట్ల స్నేహ సంబంధాలనే నెరపుతూ వచ్చింది. దక్షిణాదిన అంతటా టిప్పు యెదురులేని పరిపాలకుడని నిజాము పరిగణిస్తూ వచ్చింది హైదరూ టిప్పుకూడ తమ సామంతులుగా వుండిపోతారని నిజాం భావించింది. అసలు నిజాము టిప్పుపైన యుద్ధం చెయ్యగలిగిన శక్తివంతమైన రాజ్యంకాదు అయినప్పటికి మైసూరు పాలకులను లొంగతీసుకోవటం యెలాగా అని లోలోపల నిజాము కుట్రలు పన్నుతునే వచ్చింది.

ఇలా వుండగా బ్రిటిష్ అనుకూల బృందం ఒకటి హైదరాబాదువచ్చి మైసూరుతో నైజాం సంబంధాలు విచ్ఛినమయ్యేటట్లు చెయ్యటానికి పన్నగడ పన్నారు. మహారాష్ట్రులలాగా నైజాం కూడ కొన్ని జిల్లాలను పోగొట్టుకున్న కారణంగా సంతృప్తిగా వుండలేకపోయింది. ఆ జిల్లాలు హైదరు కాలంలోనే మైసూరు ఆక్రమించుకోవటం జరిగింది ఈ పరిస్థితుల ప్రభావంవల్ల అటు నైజాం యిటు మహారాష్ట్రులు కూడా ఏకైక లక్ష్యంతో ఒకటి కాగలిగారు. కోల్పోయిన తమతమ భూభాగాలను మళ్ళీ రాబట్టుకోవాలన్నదే వారుభయుల లక్ష్యం. అంతే కాదు టిప్పు నాలుగేళ్ళగా తాను చెల్లించవలసిన కప్పం చెల్లించకుండా వుండిపోయాడు. ఇంగ్లీషువారితో జరిపిన యుద్ధాల కారణంగా తన వనరులు యావత్తు దెబ్బతిన్నాయని అందువల్ల కప్పం చెల్లించలేనని టిప్పు వాదిస్తూ వచ్చాడు. దాని

మీదట నానా కృష్ణారావు భల్లావ్ అనే వకీలును తన తరపున హైదరాబాదుకు పంపించాడు.

అప్పుడు అతని ప్రయత్నం వల్ల నానా నిజాముల మధ్య ఒడంబడిక కుదిరింది. ఏ విధంగానయినా టిప్పును లొంగదీసుకోవాలని అటు మహారాష్ట్రులు



టిప్పును లొంగదీసుకోవాలని మహారాష్ట్రులు, నిజాముకూడా ఒక అంగీకారానికి వచ్చారు

ఇటు నిజాముకూడా ఒక అంగీకారానికి రాగలిగారు నానా నిజాము కూడ 1784 జూన్‌లో భీమా, కృష్ణానదులు కలిసేచోట యాదగిరి వద్ద సమావేశమై చర్చలు జరిపారు. ఆ మరుసటి సంవత్సరమే టిప్పుసుల్తాన్‌పై సమరం సాగించాలని ఉభయులూ ఒక అంగీకారానికివచ్చారు. నిజానికి ఆ సమయంలో టిప్పుసుల్తాన్‌కు

తన యిరుగు పొరుగు వారితో పోరాటాలు జరపడం ఏమాత్రం ఇష్టంలేదు. కాని వారు తనపై దాడికి సిద్ధమైనప్పుడు దానిని ప్రతిఘటించక తప్పదు.

1785లో జమీందారులు చెల్లించాల్సిన వార్షికకప్పాన్ని గురించి టిప్పు ఒక వివాదాన్ని లేవనెత్తాడు. ఆ వివాద ఫలితంగానే 1785-87 మధ్య మైసూరు మహారాష్ట్ర యుద్ధం సాగింది. మైసూరు ఉత్తర ప్రాంతానగల నార్గుండు ఒక చిన్న భూభాగం. 1778లో హైదరాలి దీన్ని జయించాడు. అక్కడ పాలెగాండ్రు



దేశాయి పుంగనూరు, మదనపల్లి జమీందారులను టిప్పుకు వ్యతిరేకంగా రెచ్చగొట్టాడు

అయిన వెంకట్రావు భాలె అనునతడు మైసూరు అధికారాన్ని అంగీకరిస్తూ వార్షిక కప్పం చెల్లించటానికి ఒప్పుకున్నాడు. ఇతడొక బ్రహ్మణ దేశాయి. దీనిని నానా కూడ అంగీకరించటం జరిగింది. అయితే మైసూరు యుద్ధం తర్వాత నార్గుండ్

దేశాయి కూడ మైసూరుకు వ్యతిరేకంగా విచ్ఛిన్నకర కార్యకలాపాలలో పాల్గొనటంవల్ల టిప్పు ఆగ్రహం చెందాడు. అంతే కాకుండా దేశాయి మహారాష్ట్ర జమీందారుతోనూ లాలూచి అయి మైసూరుపై దాడి చెయ్యటానికి యెత్తులేసాడు. కాని అతని ప్రయత్నాలకు మహారాష్ట్రనుంచి ప్రోత్సాహం లభించలేదు దానితో అతను ఇంగ్లీషువారివైపు మొగ్గటం జరిగింది బొంబాయి ప్రభుత్వం మద్దతునుకూడకోరాడు ఇంగ్లీషువారు అతని విజ్ఞప్తిలను అంతగా పట్టించుకోకపోవటంతో దేశాయి పుంగనూరు, మదనపల్లెలో గల జమీందారులను టిప్పుకు వ్యతిరేకంగా రెచ్చ కొట్టాడు.

ఈ విధంగా చుట్టూ శత్రుమూకలు తనపై కుట్రలు పన్నటంతో టిప్పు ఇరకాటమయిన పరిస్థితిలో పడిపోయాడు. అయినప్పటికి అతడు కప్పం బాకాయిలను చెల్లించటానికేమాత్రం ఇష్టపడలేదు. ఒకవైపు దేశాయి తనకు చెల్లించటానికి నిరాకరించి పూనాకోర్టు సాయం కోరాడు. ఈ వ్యవహారాన్ని పూనా కోర్టు క్షుణ్ణంగా విచారించింది టిప్పు చర్య అక్రమమని చివరకు తీర్పు ఇచ్చింది.

ఈ విధంగా వ్యవహారం శాంతియుతంగా పరిష్కారం కానందున టిప్పు బలప్రయోగానికి దిగవలసి వచ్చింది. అతను సయ్యదు జాఫర్ నాయకత్వాన దేశాయిపై పోరాటం జరపటానికి సైన్యాన్ని పంపించాడు మైసూరు సైనికదళాలు కోటను పట్టుకున్నాయి. అప్పుడు నానా గత్యంతరం లేక లొంగిపోవలసి వచ్చింది. అయితే నానా ఉత్తర్వులకు వ్యతిరేకంగా మహారాష్ట్ర బృందమొకటి ముందుగా దాడిచేసి టిప్పు సైన్యంపై బడింది. అయితే అరివీర భయంకరుడు, మహావీరుడయిన టిప్పుసుల్తాన్ బలమయిన సైన్యంతో మహారాష్ట్రులు అపారమైన నష్టానికి గురికావలసి వచ్చింది. దానితో శాంతియుత పరిష్కారానికై నానా ప్రయత్నాలు సాగించాడు.

ఏదియేమైనప్పటికి అల్పమైన జమీందార్ దురుకుతనంవల్ల టిప్పు సాయుధ పోరాటం సాగించవలసిన పరిస్థితి అనివార్యమైపోయింది. ఈ యుద్ధ

ఫలితాలు దక్షిణాదిలో అధికార సమవుజ్జీని తారుమారు చేసాయి. టిప్పుసుల్తాను మరింత శక్తివంతుడయ్యాడు. అజేయులయిన బ్రిటీష్‌వారు కూడ అతని షరన్ లకు అంగీకరించవలసి వచ్చింది. భారతదేశంలో ఇంగ్లీషువారు అధికారలోకి రాకుండా చెయ్యాలన్నదే టిప్పుసుల్తాన్ ప్రధాన లక్ష్యమైనట్లు కొనవస్తుంది.



మహారాష్ట్రులతోను నైజాముతోను టిప్పు 2 సంవత్సరాలు యుద్ధం కొనసాగించాడు

ఏమైనా అటు మహారాష్ట్రులతోనూ, యిటు నైజాముతోనూ టిప్పు సాగించిన యుద్ధాలు దాదాపు రెండేళ్ళపాటు కొనసాగాయి. కాని ఆ యుద్ధాలవల్ల యెవరికీ ఏమాత్రం ప్రయోజనం లభించలేదు. తన యిరుగు పొరుగు రాజ్యాలవారు అందరూ రక రకాలుగా యెత్తుగడలు సాగించి అమిత్ర ధోరణి వహించటంతో యిప్పుడు టిప్పుసుల్తాను ఏకాకిగా మిగిలిపోయాడు. సంప్రదాయ సిద్ధమైన అతని

స్నేహితులు ఫ్రెంచివారు కూడా యిప్పుడు సహాయం చేసేటట్లు కనిపించలేదు. వారు తటస్థ వైఖరినే అవలంభిస్తూ వచ్చారు. ఫ్రెంచివారి వుద్దేశ్యం ఒక్కటే, ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా భారతీయ రాజ్యాలన్నీ ఏకం కావాలన్నదే. అటు నిజాం ఇటు మహారాష్ట్రులు కలసి టిప్పుసుల్తాను అధికారాన్ని పతనంచేస్తే ఇంగ్లీషువారికి అవకాశం ఇచ్చినట్లవుతుందని ఫ్రెంచివారు భావిస్తున్నట్లు కానవస్తుంది. అంతేగాదు. భారతదేశంలో తిరుగుబాటు లేవనెత్తటానికి మహారాష్ట్రులే తగినవారని వారనుకున్నారు.

ఏది ఏమైనా యీ పరిస్థితిలో టిప్పు సుల్తాన్ కేవలం తన స్వశక్తి మీదనే ఆధారపడవలసి వచ్చింది. స్వదేశీ రాజుల మధ్య అంతఃకలహాలు రూపు మాపటానికి టిప్పు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. ఏ రకమైన శాంతి సంప్రదింపులూ ఫలించలేదు.

1786 మేలో యుద్ధం ప్రజ్వరిల్లింది. టిప్పు విరోధులందరూ బాదామీపై దాడి చేసారు. ఆ పోరాటం దాదాపు 21 రోజులు కొనసాగింది. బాదామిని పట్టుకున్న తర్వాత నానా పూనాకు వెళ్ళిపోయాడు. తన సైన్యాన్ని హరిపంత్ అధీనంలో వుంచాడు.

యుద్ధం తలయెత్తినప్పుడు టిప్పు కూర్కులో ఉన్నాడు. అతను ఎకాయెకిన తన సైన్యాన్ని ఆదోనికి రప్పించి నైజాము అక్కడికి పంపిన అదనపు బలాలను గట్టిగా యెదుర్కొన్నాడు. ఆదోని కోట టిప్పు స్వాధీనమైంది. 1786లో టిప్పు తుంగభద్రా నదిని దాటి వెళ్ళాడు. అక్టోబరు ఒకటిన రాత్రి వేళలో మహారాష్ట్రి శిబిరంపై దాడిచేసి శత్రు సేనలు అనేక ఇక్కట్లకు లోనయ్యేటట్లు కావించాడు. మరొక సందర్భంలో నవంబరు 30న అలాగే రాత్రిపూట దాడి చేసి శత్రువుకు తీవ్ర నష్టం కలిగించాడు. 1787 జనవరి 3న నిర్భేద్యమైన కోటను టిప్పు పట్టుకోవటం జరిగింది. ఇలా ఫిబ్రవరి 10వ తేదీ వరకు మహారాష్ట్రుల

పైనా, శత్రు సేనలపైన టిప్పు సుల్తాను నిర్విరామంగా యుద్ధం సాగిస్తూ వచ్చాడు.

ఈ విధంగా భయంకరమైన అనేక యుద్ధాలలో టిప్పు విజయం సాధిస్తూ వచ్చినప్పటికీ, పోరాటాలను అంతమొందించాలనే అతను వాంఛిస్తూ వచ్చాడు. అందుకు గాను 1786 సెప్టెంబర్ లగాయితూ మహారాష్ట్రులతో సంబంధాలు పెట్టుకొని శాంతి యత్నాలు సాగించాడు.



టిప్పు 1786లో తుంగభద్రను రాత్రిపూట దాటి వెళ్ళాడు.

టిప్పు సుల్తాన్ శాంతికోసం యెంతగా ఆరాటపడుతున్నా మరొక వైపున ఇంగ్లీషువారు తటస్థంగా వుండిపోవడం ఆయన గ్రహించాడు. నానా కూడా శాంతినే వాంఛించాడు. ఎందుచేతనంటే మిత్రపక్షాలన్నీ యుద్ధమంటే వెనుకంజ వేస్తూ

వచ్చాయి. అంతేకాకుండా ఇంగ్లీషువారు ఆ సమయంలో ఈ కలహాలలో జోక్యం చేసుకోకుండా వుండిపోయారు. మెక్ఫర్‌సన్ తనకై తాను ప్రతి మిత్ర దేశానికి ఒక్కొక్క సైనిక దళాన్ని పంపించటానికి వాగ్దానం చేసినప్పటికీ లార్డ్ కారన్ వాలిస్ తన విధానాన్ని సవరించుకున్నాడు. టిప్పు బద్రూజ్ జమాన్ ఖాన్‌ను.



టిప్పు తాను జయించిన ప్రదేశాలను తిరిగి అప్పగించడానికి అంగీకరించాడు.

అధీరజాఖాన్‌ను పూనాకు పంపించాడు. ఈ పరిస్థితిలో నానా యిది అవకాశంగా తీసుకొని శాంతి సంప్రదింపులు జరుపవలసినదిగా హరిపంతుల్ని కోరాడు. ఉభయ పక్షాలు తీవ్రంగా వాదోపవాదాలు జరిపాయి. టిప్పు తాను జయించిన ప్రదేశాలను తిరిగి అప్పగించడానికి అంగీకరించాడు. అయితే తుంగభద్రకు ఉత్తరాన ఉన్న భూభాగాలపై తన సార్వభౌమాధికారమే వుండితీరాలని పట్టుపట్టాడు. దానికి మారుగా తాను

చెల్లించవలసిన కప్పం 48 లక్షల రూపాయలు రెండు వాయిదాలలో చెల్లిస్తానన్నాడు. అయితే హరిపంత్ విశాఖపట్నమైనా భూభాగాన్ని లెక్కి అప్పగించాలని డిమాండ్ చేసాడు. అయితే టిప్పు కురాపంతేను విడుదల చేసి అధోని, నార్గుండ్, కిట్టూరులను ఆయా సంస్థానాధీశులకు అప్పగించటానికి ఒప్పుకున్నాడు. కాని సావనూర్‌ను మాత్రం అట్టిపెట్టుకుంటానని చెప్పాడు. అలాగే పేష్వాకు బాదామిని అప్పగించి గజేంద్రఘర్ మాత్రం తన అధీనంలో వుంచుకుంటానన్నాడు. ఇక ముందు తాను చెల్లించవలసిన బకాయిలన్నీ యెప్పటికప్పుడు సక్రమంగా చెల్లిస్తానని అంగీకరించాడు.

మహారాష్ట్రులు కృష్ణకు దక్షిణాన గల భూభాగాలపై టిప్పు ఆధిపత్యాన్ని అంగీకరించారు. ఎలాగయితేనేం హరిపంత్ ఈ రాజీ ప్రతిపాదనలన్నిటికీ అంగీకరించాడు. ఆ ప్రకారంగా 1787 ఏప్రియల్‌లో గజేంద్రఘర్ వద్ద సంధి పత్రంపై సంతకాలు జరిగాయి.

ఈ సంధి టిప్పుకు యేమాత్రం ప్రయోజనకరంగా లేదు. సైనిక రీత్యా అతనిదే పైచేయి అయినట్లు స్పష్టంగా ఋజువైనప్పటికీ, యీ యుద్ధం వల్ల ఆర్థికంగా గాని, మరి భూభాగాలను ఆక్రమించుకోవటం ద్వారగాని ఎలాంటి ప్రయోజనం చేకూరలేదు.

ఇదిలా వుండగా త్వరలోనే స్వదేశీ రాజులు ఇంగ్లీషువారితో చేతులు కలిపి టిప్పు ప్రాబల్యాన్ని తగ్గించటానికి మరో ప్రయత్నం చేశారు. స్వదేశీ రాజులు ఆంగ్లేయులతో చేరకుండా టిప్పు అనేక విధాల ప్రయత్నం చేసాడు అయినప్పటికి ప్రయోజనం లేకపోయింది. టిప్పు తన ఆశయం నెరవేరనందుకు యెంతగానో నిరాశ చెందాడు.

ఆ రీతిగా భారతీయ ప్రభువులు మళ్ళీ తమలో తాము అల్పమైన కలహాలకు దిగారు. అది విదేశీయుల ప్రాబల్యం మరింతగా బలపడటానికి యెంతగానో దోహదం చేసింది. అంతకు ముందు నుంచి మైసూరు ప్రభువులపై సైనికంగా

ఆధిక్యంగల మహారాష్ట్రులు మైసూరుకు ఒక పీడకలలా పరిణమించారు. ఈమాటు వారు నైజాముతో ఏకమై తాము పోగొట్టుకున్న భూభాగాలను తిరిగి పొందే ప్రయత్నంలో టిప్పును దెబ్బ కొట్టడానికి ప్రయత్నించారు. యుద్ధం ఫలితంగా నిజాం పరిస్థితిలో పెద్దగా మార్పు రాలేదు. యుద్ధ రంగంలో గణనీయమైన స్థానం లేదు. అలాగే రాజ్య తంత్రంలో కూడా తగినంత నేర్పు కనపడలేదు. ఏమైనా



స్వదేశీ రాజులు ఇంగ్లీషు వారితో చేతులు కలిపి టిప్పు ప్రాబల్యాన్ని తగ్గించడానికి ప్రయత్నం చేసారు.

మూడో మైసూరు, నాలుగో మైసూరు యుద్ధాలలో వారు పాల్గొన్నారు. అయితే తుట్టతుదకు నిజాం పరిస్థితి యెందుకు కాకుండా పోయింది. కేవలం ఒకర్ని అంటి పెట్టుకుని వారిని అనుసరించవలసిన పరిస్థితిలోనే వారుండిపోయారు. కాల్మక మేజా

సైనికంగానూ, తదితర విధానాలతోనూ ఆంగ్లేయులు, నిజాం ప్రాంతంలో ప్రాబల్యం సంపాదించగలిగారు.

యుద్ధంలో టిప్పు స్వల్పంగా ప్రయోజనం పొందినప్పటికీ, కొన్ని దుర్గాలను మహారాష్ట్రులకు అప్పగించినప్పటికీ, ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా ఒక సమైక్య కూటమిని యేర్పాటు చేయగల్గాడు.

# 4. విదేశాలతోనూ, భారతీయ ప్రభువులతోను టిప్పు సంబంధ బాంధవ్యాలు

టిప్పు బాహ్య ప్రపంచంతోటి అలాగే రాజకీయపరమైన రాయబారాలు వగైరా సాగించడంలోనూ ఎంతో ప్రీతి కనపరుస్తూ వచ్చాడు భారతదేశపు రాజకీయాలలో ఒక వినూత్న ధోరణిని పాశ్చాత్యులు ప్రవేశపెట్టారన్న వాస్తవాన్ని టిప్పు గ్రహించాడు. తత్ఫలితంగా దేశ రాజకీయాలలోనూ, భారతీయ రాజకీయాలలోనూ, సాంప్రదాయ సిద్ధమైన వైఖరిలోనూ యెంతో మార్పు కనిపించింది.

స్వదేశీ సంస్థానాధీశ్వరులలో వంశపారంపర్యంగా సంక్రమిస్తూ వచ్చిన ఒకే ఒక బలహీనత వుంది. వారి మధ్య సమైక్యత లోపించడమే అది. అందువల్ల టిప్పుసుల్తాన్ బయటి నుంచి సహాయాన్ని అర్థించవలసి వచ్చింది. అందుకుగాను అతను ఫ్రాన్సు, టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్‌లతో సంబంధాలు పెట్టుకోవడానికి ప్రయత్నం చేసాడు. రాజకీయంగా తన లక్ష్యం నెరవేరకపోయినప్పటికీ యీ విధంగా టిప్పు దేశ వర్తక వాణిజ్యాలు అభివృద్ధి చేయటానికి యెంతో దోహదం చేసాడు. కొన్ని ముఖ్యమైన వాణిజ్య వస్తువుల విషయంలో, ముఖ్యంగా యెంతో విలువైన మిరియాలు, ఏలకులు మొదలగు సుగంధ ద్రవ్యాలు, అలాగే మంచి గంధపు చెక్క, దంతాలు, పట్టు, కొబ్బరికాయలు, పొగాకు, ఏనుగులూ మున్నగు వాటి విషయంలో విదేశాలకు అపారంగా వీటిని పంపించి వాణిజ్యాభి

వృద్ధికి మిక్కిలి తోడ్పడ్డాడు. ఈ వస్తువులకు విదేశాలలో మంచి గిరాకి వుంది. అందువలన చైనా, పెగు, అర్మేనియా, జిడ్డా మొదలగు విదేశాలన్నీ ఇండియాతో వాణిజ్య సంబంధాలు మెరుగుపరచుకున్నాయి. అయితే ఇంతకంటే ముఖ్యమైన రాజకీయ ఆశయం నెరవేర్చటానికి విదేశాల కతను దౌత్య ప్రతినిధుల్ని పంపక తప్పలేదు.



టిప్పు దేశ వర్తక వాణిజ్యాన్ని అభివృద్ధి చేయటానికి ఎంతగానో దోహదం చేసాడు.

18 వ శతాబ్దంలో టర్కీ బలహీనంగా వున్నప్పటికీ ఎంతో కొంత ప్రాధాన్యతను, ప్రాముఖ్యతను సంపాదించుకోకల్గింది. యూరపులో పెద్ద భూభాగా లకు రష్యన్లు విస్తరించకుండా టర్కీ ప్రతిఘటించ గల్గింది. కాని మరొక వైపు బ్రిటిష్‌వారు ఇస్లామిక్ ప్రపంచమంతటికీ ఒక పెద్ద ముప్పుగా పరిణమించటం,

అలాగే భారతదేశానికి కూడా ప్రమాదకరంగా రూపుదాల్చటం టిప్పుసుల్తానుకు ఆందోళన కలిగిస్తూ వచ్చింది. ఈ పరిస్థితిలో టిప్పుసుల్తాను ఐరోపియన్‌లకు వ్యతిరేకంగా ఒక యిస్లామిక్ కూటమిగా యేర్పడాలని టర్కీ సుల్తానును కోరటం జరిగింది.



టిప్పు ఐరోపియన్లకు వ్యతిరేకంగా ఇస్లామిక్ కూటమిగా ఏర్పడాలని టర్కీ సుల్తాన్‌ను కోరటం జరిగింది.

కాబట్టి 1784 లో ఇంగ్లీష్ వారితో యుద్ధం జరిగిన వెంటనే టిప్పు కాన్‌స్టాంటునోపుల్‌కు ఉస్మాన్‌ఖాన్ నాయకత్వాన్న ఒక దౌత్య ప్రతినిధి వర్గాన్ని పంపాడు. అది యెంతో అనుకూలంగా పరిణమించింది. దానితో టిప్పు 1785 లో మరొక ప్రధానమైన ప్రతినిధి వర్గాన్ని పంపాడు. అయితే యీ దౌత్య ప్రతినిధి

వర్గాల కార్యకలాపాల విషయంలో కాన్‌స్టాంట్‌నోపుల్‌లో కొంత వివాదం చెల రేగింది. అందుకు కారణం యింగ్లీషువారి కుతంత్రాలేనని చెప్పవచ్చు. ఇంగ్లీషు వారితో పోరడటానికి టర్కీ సుల్తానుకు తగినంత నౌకాబలం, వాణిజ్య నౌకాబలం కావలసి వచ్చింది.

అయితే టిప్పు టర్కీ సుల్తాన్‌కు స్పష్టంగా ఒక విషయం తెలియ జేశాడు. బ్రిటిష్‌వారు భారత భూభాగంలో నమ్మక ద్రోహానికి పాల్పడుతూ, రాజ్య విస్తరణ కాంక్షతో ప్రయత్నాలు సాగిస్తున్నట్టు స్పష్టం చేసాడు. అందువల్ల మైసూరుకు సైనిక సహకారం అందించటానికి టర్కీ అంగీకరించింది. టిప్పు టర్కీ సైన్యాలకు అయ్యే ఖర్చులు యావత్తు భరించటానికి, తన కార్యం నెరవేరిన వెంటనే వారిని తిరిగి పంపివేయటానికి అంగీకరించాడు. అలాగే మైసూరులో కర్మాగారాలు మొదలైనవి స్థాపించటానికి, వర్తక వాణిజ్యాల మార్పిడికి టర్కీ అంగీకరించింది. అదే విధంగా తుపాకులు, ఇతర ఆయుధాలు, మందుగుండు సామగ్రీ మొదలైనవి తయారుచెయ్యటంలో అవసరమైన సాంకేతిక సహకారాన్ని అందించటానికి టర్కీ అంగీకరించింది.

వాణిజ్యాన్ని, పరిశ్రమల్ని అలక్ష్యం చెయ్యటం వల్లనే ప్రాచ్యంలో పరిస్థితులు క్షీణించటానికి ప్రధాన కారణమని టిప్పు పదే పదే పేర్కొంటూ వచ్చాడు. చట్టపరంగా చూస్తే టిప్పు పరిస్థితి మైసూరులో బలహీనంగానే వుందని చెప్పవచ్చు. అటు నైజాము, మహారాష్ట్రులు, కర్నాటక నవాబు, వీరిని మొగల్ చక్రవర్తి చట్టపరంగా గుర్తించటం జరిగింది. అయితే హైదర్‌ను కాని, టిప్పును గాని యీ విధంగా గుర్తించటం జరగలేదు. మైసూరుపై చట్టపరంగా సార్వ భౌమాధికారం కల్గి వున్నప్పటికి హైదరాలీ టిప్పుసుల్తాన్లకు వాస్తవంగా చూస్తే ధర్మశాస్త్రరీత్యా రాష్ట్ర పాలకులుగా అలాంటి గుర్తింపు పొందలేకపోయారు. మొగలాయీ చక్రవర్తియొక్క చట్టపరమైన గుర్తింపు కావాలని టిప్పు యెన్నడూ కోరలేదు. ఎందుచేతనంటే దక్షిణాదిన మొగల్ వైస్రాయి నైజాములోవున్నాడు.

నైజాముకు మైసూరు క్రింది స్థానంలోనే వుంటూ వచ్చింది. టిప్పురాజాను పదవీ చ్యుతుణ్ని చేసి సర్వతంత్ర స్వతంత్ర దళావాయిగా ప్రకటించుకోవటం జరిగింది.

గజేంద్రఘర్ సంధిలో బాదుషా అనే బిరుదుకావాలని టిప్పు పట్టు పట్టాడు. అయితే స్వతంత్ర ప్రతిపత్తిగల సుల్తాన్‌గాను. భారత



టిప్పురాజాను పదవీచ్యుతుణ్ణిచేసి సర్వతంత్ర స్వతంత్ర దళవాయిగా ప్రకటించుకోవటం జరిగింది

దేశంలోని తక్కిన రాజులందరి మధ్య అతడు గొప్ప మర్యాదలు గల ప్రభువుగాను గుర్తించటం జరిగింది. సర్వసతంత్రుడైన చక్రవర్తిగా టిప్పు సుల్తాన్‌ను, టర్కీసుల్తాన్ సలీం సంభోధించటాన్నిబట్టి యీ విషయం తేటతెల్లమౌతుంది. గజనీ మహ్మద్, ఇల్టూటిమిష్, మహ్మద్‌బిన్‌తుగ్లక్, ఫిరోజిషా గతంలోని యీ ప్రభువులందరూ కూడా ఖలీఫాల నుండి ఇలాంటి ప్రతిష్టను

పొందగలిగారు. అయితే టిప్పుమాత్రం అటు నిజాంను ఇటు కర్నాటక నవాబును కూడ తనక్రింది పాలకులుగానే పరిగణిస్తూ వచ్చాడుగాని, మొగలాయీచక్రవర్తుల అధికారానికి ఎన్నడూ అతడు లోబడి వుండలేదు.

టిప్పుసుల్తాన్ కాన్‌స్టాంట్‌నోపుల్‌కి రాయబారులను పంపాడు వారిని టర్కీసుల్తాన్ మర్యాద పూర్వకంగా ఆహ్వానించి ఎంతగానో ఆదరించాడు అయితే ప్రధానసంధిలోఅంశాన్ని మాత్రం త్రోసిపుచ్చాడు. దానికి కారణంలేకపోలేదు. ఒక వైపునరష్యన్లు దురాక్రమణచేసే తలంపుతోరాజ్యవిస్తరణకాంక్షకుఒడికట్టిటర్కీలకు ప్రమాదకరంగా పరిణమించారు వారిని నిరోధించటంలో తాము నిమగ్నమైవున్నామని టర్కీసుల్తాన్ అబ్దుల్‌హమీద్ తెలియజేసాడు. ఈ పరిస్థితిలో బ్రిటిష్‌వాళ్ళు దీన్ని అవకాశంగా తీసుకొని టర్కీల సమగ్రతకే భంగం కలిగించే విధానాలను అనుసరిస్తూ వచ్చారు టర్కీలకు బ్రిటిష్‌వారితో ప్రత్యక్షంగా విరోధం తెచ్చుకోవటం అంతగా ఇష్టంలేదు.

అయితే ఇక్కడొక్క విషయాన్ని తప్పక గమనించవలసివుంటుంది. టిప్పుమరొక లక్ష్యం నెరవేరింది అదితననుగుర్తించాలన్నవిషయం. అందుమీదట రాయబారులు టిప్పును సర్వతంత్ర స్వతంత్ర ప్రభువుగా గుర్తిస్తున్నట్లు తను సొంతంగా నాణాలను ముద్రించుకునే అధికారం ఇస్తున్నట్లు టర్కీనుంచి ఒక ఫర్మానాను తీసుకొని రావటం జరిగింది. ఈ విధంగా టిప్పు రాయబారులు దాదాపు నాలుగు సంవత్సరాల తర్వాత 1789 డిశంబరులో భారతదేశానికి తిరిగి వచ్చారు.

టిప్పుసుల్తాన్ మొగలాయీ చక్రవర్తులతో కూడ సంబంధాలుపెట్టుకొన్నాడు. వీళ్ళలోవున్న తన ఏజెంట్ల ద్వారా రాజ్య విషయాల్ని ఎప్పటికప్పుడు ఢిల్లీ ఆస్థానానికి తెలియపరుస్తూ వచ్చాడు. ఇలా వుండగా 1783లో టిప్పు ఆర్కాటుయొక్క "సనద్"ల కోసం షా ఆలంకు దరఖాస్తు పెట్టాడు. ఫ్రెంచివారుకూడా అతని ప్రతిపాదనను బలపరచటం జరిగింది. తన దరఖాస్తును అంగీకరిస్తే మొగలాయిలకు తను బకాయిపడిన ఆర్కాటు తాలూకు కప్పం

చెల్లించగలనని టిప్పు స్పష్టంచేశాడు. కాని మొగలు చక్రవర్తి ముఖ్య సలహాదారుడు అందుకు అంగీకరించలేదు. దీనికి తోడు ఢిల్లీలో టిప్పు ప్రయత్నాలు సాగకుండా బ్రిటిష్‌వారు అడ్డుపడ్డారు.

ఆ రీతిగా అటు టర్కీవారు, ఇటు ఢిల్లీలో మొగలాయీ చక్రవర్తులు ఉభయుల మద్దత్తు సంపాదించటంలో టిప్పు విఫలం కావటంతో, మళ్ళీ అతడు



తను స్వతంగా నాణేలా ముద్రించుకొనే అధికారం ఇస్తున్నట్లు టర్కీనుంచి రెవఫర్మానా తీసుకురావడం జరిగింది

ఫ్రెంచివారివైపు చూడవలసి వచ్చింది. ఫ్రెంచివారు ఇటు ఇంగ్లీషువారితోనూ, అటు మహారాష్ట్రులతోనూ టిప్పు సాగిస్తూ వచ్చిన యుద్ధాలలో టిప్పును యెంతో నిరాశపర్చటం జరిగింది. ఈ విధంగా టిప్పుకు ఫ్రెంచివారికి మధ్య స్పర్ధలు వుత్పన్నమైనాయి. అయినప్పటికి ఇంగ్లీషువారిని దూరంగా వుంచాలన్న వుమ్మడి

లక్ష్యంతో ఫ్రెంచివారు, టిప్పు సుల్తాన్‌ల మధ్య బలీయమైన బాంధవ్యం యేర్పడి నది. ఇంగ్లీషువారిని భారతదేశం నుంచి తరిమి వేయటమే ఆది నుంచి టిప్పు సుల్తాన్ లక్ష్యంగా వుంటూ వచ్చింది. అందుకుగాను సైనిక సహాయం అందించ వలసిందిగా అతడు ఫ్రెంచివారిని కోరాడు. 10,000 మంది సైనిక దళాలను పంపవలసిందిగా అర్థించాడు. ఒకసారి ఇంగ్లీషువారితో ఆ విధంగా బలీయమయిన



10,000 మంది సైనిక దళాలను పంపమని టిప్పు ఫ్రెంచివారిని అభ్యర్థించాడు

సమరం ప్రారంభిస్తే, అది మద్రాసు, బొంబాయి, బెంగాలు స్వాధీన పర్చుకునే దాక కొనసాగి తీరుతుంది. మొదట దక్షిణాదిన ఇంగ్లీషువారికి తావు లేకుండా చేయగలిగితే పిమ్మట ఉత్తర భారతం విషయంలో ఆలోచించవచ్చు. కాని ఇన్ని ఆలోచనలతో రాజకీయ చతురతతో, అపారమయిన దేశభక్తితో తెల్లదొరల బారి

నుండి భారతదేశాన్ని సర్వవిధాల రక్షించాలని టిప్పు చేసిన ప్రయత్నాలు చివరకు విఫలంకావటం విచారకరం. టిప్పు ఆశించిన మేరకు ఫ్రెంచివారు సైనిక సహాయం అందచేస్తూ తన పక్షాన్న నిలబడలేకపోయారు.

కాగా మంగుళూరు సంధి తర్వాత ఇంగ్లీషువారితో టిప్పు సంబంధాలు వెనకటిలాగే ప్రతికూలంగా వుంటూ వచ్చాయి. కంపెనీ వ్యవహారాలు చూడటానికి ఆ తర్వాత వచ్చిన హేస్టింగ్స్ కూడా టిప్పుపట్ల అమిత్ర వైఖరినే కొనసాగిస్తూ వచ్చాడు. రెండవ మైసూరు యుద్ధకాలంలో ఆక్రమించుకున్న ప్రదేశాలనుండి వైదొలగే విషయంలో యెంతగానో ఇబ్బందులు యెదురవుతూ వచ్చాయి. అంతే గాక మలబారు నాయకుల వ్యవహారాలలో ఇంగ్లీషువారు యెంతగానో ప్రమేయం పెట్టుకోవటం టిప్పును ఆశ్చర్యచకితుణ్ని చేసింది. 1786-87లో జరిగిన మైసూరు మహారాష్ట్రి యుద్ధంలో టిప్పు యుద్ధం సాగించటం ఇరుగు పొరుగు సంస్థానాధీశులకు మరింతగా అసూయా ద్వేషాలకు కారణమయింది. మరొకవైపు టిప్పు కర్నాటకపై దాడిచెయ్యటానికి ప్రయత్నిస్తున్నట్లు వార్తలు రావటంతో కారన్ వాలిస్ టిప్పుపట్ల ఆగ్రహం చెందాడు. తూర్పిండియా కంపెనీపై అందరం కల్సి చర్యతీసుకోవాలన్న టిప్పు సూచన అటు మహారాష్ట్రులు, ఇటు కర్నాటక కూడా వ్యతిరేకించారు ఇంకా చెప్పాలంటే నిజాంకూడా యిందుకు సిద్ధపడలేదు. ఆ విధంగా ఆంగ్లేయులు భారతభూమిపై కాలూనకుండ టిప్పుసుల్తాను సర్వవిధాల చేసిన ప్రయత్నాలు భగ్నమయినాయి.

1789 సెప్టెంబరులో ఇంగ్లీషువారు బలవంతాన గుంటూరును ఆక్రమించుకోవటంతో నిజాంకు ఆంగ్లేయులపై ఆగ్రహం వచ్చింది. అప్పుడు నైజాం టిప్పు సహాయాన్ని అర్థించవలసి వచ్చింది. వారు హైదరాబాదు నుంచి శ్రీరంగ పట్టణానికి దూతల్ని పంపించారు. దానిపై టిప్పు నిజాంతో ఒక ఒప్పందం చేసుకోవటానికి ప్రయత్నించాడు. ఆ ప్రతిపాదనలలో ఒకటి నిజాం కుమార్తెను టిప్పు కుమారులలో ఒకరికి వివాహం చేయించాలన్నది ఒక ప్రతిపాదన. కాని

నిజాం అందుకు అంగీకరించలేదు. సంధి ప్రయత్నాలు విఫలమైనాయి. అయితే 1788 నవంబరులో నిజాము మళ్ళి టిప్పుతో సంప్రదింపులు ప్రారంభించాడు. టిప్పు తన తరపున వకీళ్ళను హైదరాబాదుకు పంపించాడు. ప్రతిపాదనలను ఖరారు చేయవలసిందిగా ఆదేశించాడు.



ఇంగ్లీషువారు నిజామును తమవైపు తిప్పుకోవడానికి తీవ్రంగా ప్రయత్నం చేసారు.

అయితే యీ మాటుకూడ సంధి ప్రయత్నాలు ఫలించలేదు. ఈ సమయంలో ఇంగ్లీషువారు నిజామును తమవైపు త్రిప్పుకోటానికి తీవ్రంగాను, చురుకుగాను ప్రయత్నిస్తూ వచ్చారు. నిజాంకు మైసూరును జయించి పెడ్తానన్ని కారన్‌వాలీస్ వాగ్దానం చేసాడు. ఇంగ్లీషువారి రాజకీయ చతురతకు నిజాం లొంగిపోయాడు.

టిప్పు ఇటు దేశీయ ప్రభువులతోనూ అటు విదేశీ ప్రభుత్వాలతోనూ సత్సంబంధాలు నెలకొల్పుకుంటూనే స్వతంత్ర భారతాన్ని పరిరక్షించు కోవాలన్న లక్ష్యం నెరవేరనేలేదు. అతని రాజకీయ ఆశయాలు యే విధంగాను ఫలించలేదు. అతను ఆశించిన విధంగా అటు ఫ్రాంసు, యిటు టర్కీ కూడ చాల క్లిష్ట పరిస్థితిలో వున్నందున టిప్పుకు యే విధంగానూ తోడ్పడలేకపోయారు. యిక్కడ మహారాష్ట్రీలు, నిజాంకూడా స్వప్రయోజనాలతో స్వవిషయాలనుచూసుకోవటంలో నిమగ్నమైనారు. మైసూరుతో తమకు గల విరోధం కారణంగా టిప్పుతో సహకరించటానికి వారు ముందుకు రాలేదు. ఈ ప్రకారంగా చూస్తే టిప్పుసుల్తాన్ రాజకీయంగా యేకాకిగా మిగిలిపోయాడని చెప్పవచ్చు. అయితే ఒకటిమాత్రం జరిగింది. వర్తక వాణిజ్యాల విషయంలో టిప్పుసుల్తాన్ అటు విదేశాలతోనూ, యిటు యిరుగు పొరుగు రాజ్యాలతోనూ యెంతో పురోభివృద్ధిని సాధించుకో గలిగాడు.

## 5. మూడవ మైసూరు యుద్ధం

టిప్పు కార్యకలాపాల్ని గురించి యింగ్లీషువారు నిరంతరం అప్రమత్తంగానే వుంటూ వచ్చారు. మంగుళూరు సంధి వాస్తవ పరిస్థితుల దృష్ట్యా మరో యుద్ధానికి దారి తీసింది. ఒక్క యింగ్లీషువారేగాక, తమ పొరుగున వున్న రాజ్యం మరింత బలపడటం చూసి ఓర్వలేక మహారాష్ట్రీలు, నిజాం కూడా యెంతో అసంతృప్తికి లోనైనారు. అవకాశం దొరికితే చాలు టిప్పుపై దెబ్బ తీయాలని, తగు విధంగా అతడిని శిక్షించాలని ఎదురుచూస్తూ వచ్చారు.

అప్పుడే తిరువాన్కూరు ప్రసక్తి వచ్చింది. ఆ సమయంలో తిరువాన్కూరు ఒక వివాదంగా వుంటూ వుంది. తిరువాన్కూరులోని అత్యధిక భాగం కొచ్చిన్ రాజా నిర్మించింది. కొచ్చిన్ రాజు టిప్పుకు సామంత రాజు. టిప్పు ఈ కట్టడాలను కూల్చి వేసి మైసూరుకు వ్యతిరేకంగా వున్న సేనలకు అక్కడ ఆశ్రయం యివ్వవలసిందిగా కోరాడు. అయితే యీ ప్రతిపాదనకు

కొచ్చిన్ రాజా అంగీకరించలేదు. దానితో తీవ్రమైన వివాదం చెలరేగింది. ఆ నిర్మాణాలు తన సామంత రాజ్యంలోనివి గనక వాటిని తొలగించాలని కోరే హక్కు తనకున్నదని టిప్పు వాదన.

యింగ్లీషువారేకాక మహారాష్ట్రులు నైజాము కూడ తమ పొరుగు రాజైన టిప్పు అత్యంత బలీయమైన వ్యక్తిగా రూపు దాల్చటం యిష్టంగా లేదు. టిప్పుకు గుణపాఠం చెప్పే సమయం ఎప్పుడు ఆసన్నమౌతుందా అని వారు యెదురు చూస్తూ వచ్చారు. ఇకనేం ! తిరువాన్కూర్ సమస్య వుత్పన్నం కానే అయింది.

ఇప్పుడు టిప్పు తిరువాన్కూర్ వివాదంలో యెంతగానో నిమగ్నమై యున్నాడు. రక్షణగా అతను ఒక వెదురు కట్టడాన్ని నిర్మించటంలో తీరిక లేకుండా వున్నాడు. ఈ నిర్మాణ శ్రేణిలో అత్యధిక భాగం టిప్పు సామంత రాజైన కొచ్చిన్ రాజా నిర్మించాడు. ఈ నిర్మాణాలను తొలగించవలసినదిగా టిప్పు కోరుతూ వచ్చాడు. ఎందుచేతనంటే మైసూరు నుంచి వచ్చే వ్యతిరేక శక్తులకు ఈ వెదురు శ్రేణి ఒక ఆశ్రయంగా వుంటూ వచ్చింది. కాని కొచ్చిన్ రాజా యిట్లు తొలగించటానికి యిష్టపడలేదు. అందుచేత తీవ్రమైన వివాదం చెలరేగింది. ఈ శ్రేణి తన సామంతరాజ్యంలో వుంది గనుక దీనిని తక్షణం తొలగించే హక్కు తనకు వుందని టిప్పు వాదిస్తూ వచ్చాడు.

అయితే కొచ్చిన్ రాజా మలబార్ రాష్ట్రం నుంచి టిప్పుకు వ్యతిరేకంగా తిరుగుబాటు ధోరణులను ప్రోత్సహిస్తూ వచ్చి యీ శ్రేణి విషయంలోనే కాక క్రాంగనూరు, తికొట్టైయిలో గల రెండు వచ్చి దుర్గాలను కొనుగోలు చెయ్యాలని టిప్పు ఆలోచించాడు. అందుకు కూడా కొచ్చిన్ రాజా అడ్డు తగిల అతని ఆగ్రహాన్ని మరింత రెచ్చగొట్టాడు.

ఐకొట్టయి ఉత్తర సరిహద్దు అంచునగల ఒక కీలకమైన సైనిక స్థావరం. యిది మలబారు తీరంలో వ్యాపీన్ దీపంలో చాలా యిరుకు ప్రదేశంలో

వుంది. ఐకొట్టాయి నుంచి క్రాంగనూరు షుమారు రెండు మైళ్ళ దూరంలో వుంది. ఈ రెండు స్థానాలను రాజా తన అధీనంలో వుంచుకోవటానికి ప్రయత్నించటంతో మూడవ మైసూరు యుద్ధానికి నాందీ వాక్యం పలికింది. నిజానికి యీ రెండు స్థలాలు అటు రాజాకు, యిటు టిప్పుకు కూడ అత్యంత కీలకమైన స్థావరాలు. ఈ ప్రదే



తిరువాన్కూర్ పక్షాన నిలబడ్డ కారన్ వాలీసు

శాలను అమ్మకం చేసే విషయంలో టిప్పు డచ్చివారితో సంప్రదింపులు జరిపాడు. దీనిమీద తిరువాన్కూర్ రాజా ప్రమేయం కల్గించుకున్నాడు. యిదిలా వుండగా రాజా యీ ప్రదేశాలను కొనుగోలు చేసే విషయంలో మద్రాసు ప్రభుత్వం అతన్ని ప్రోత్సహిస్తూ వచ్చింది. ఎన్నిమార్లు హెచ్చరిస్తూ వచ్చినప్పటికీ మద్రాసుతో సంప్రదించకుండానే కొచ్చిన్ రాజా యీ స్థలాల్ని ఆక్రమించుకున్నాడు. 1789 జూలై 31న ఈ స్థలాల విక్రయం జరిగింది. కాని ఆగస్టు 17 వరకు ఈ లావా

దేవీల గురించి యింగ్లీషు వారికేమాత్రం తెలీదు. ఈ దుర్గాలు 3 లక్షల వెండి రూపాయలకు అమ్మకం చెయ్యటం జరిగింది.

డచ్చివారితో టిప్పు సంబంధాలు అంత సాఫీగాలేవు. ఆ ప్రాంతంలో యెంతో పలుకుబడి కల్గి వ్యాపార రీత్యా లాభం పొందుతూ వచ్చిన యూదు వర్తకులు టిప్పు వల్ల ప్రమాదం వచ్చిపడిందని గ్రహించారు. అందువల్ల టిప్పు రాజా భూభాగాల్ని దురాక్రమణకు పాల్పడేలాగా చేసింది. ఆ విధంగా రాజాకు డచ్చి దుర్గాలను విక్రయించే పధకాలపట్ల టిప్పు ఆగ్రహించెంది. ఎలాగైనా వాటిని జయించి తీరాలని సంకల్పించుకున్నాడు.

మొదట్లో యీ ప్రదేశాల విక్రయ ప్రతిపాదనకు యింగ్లీషువారు ఆమోదించలేదు. మద్రాసు ప్రభుత్వం గట్టి షరతులతో లేఖ వ్రాసింది ఈ భూభాగాలలో తమ పరిరక్షణను వుపసంహరించుకుంటామని పేర్కొన్నది.

ఈ ప్రదేశాల విక్రయం టిప్పుకు యెంతో కోప కారణమైనప్పటికి, వివాదాన్ని యింగ్లీషువారు శాంతియుతంగా పరిష్కరించగలరని దాదాపు ఐదు నెలలు వేచి వున్నాడు, కాని ఏమీ జరగలేదు. అప్పుడు టిప్పు తప్పనిసరై తన సైనిక దళాలను కొచ్చిన్ రాజాపై తరలించాడు. ఆ విధంగా తొలి సాయుధ పోరాటం 1789 డిసెంబర్ 29వ తేదిన జరిగింది టిప్పు క్రాంగనూరు, ఐకొట్టయిలపై దాడి కొనసాగించి తిరువాన్కూరు శ్రేణిని ధ్వంసం చేశాడు.

భారతీయ సంస్థానాధీశుల వ్యవహారాలలో తాము జోక్యం కల్గించుకోకూడదని మొదటిలో కారన్‌వాలీసు ప్రభృతులు అనుకున్నప్పటికి తర్వాత తమ విధానాల్ని మార్చుకొని శ్రేణి నిర్మాణంలో తిరువాన్కూర్ రాజాకే హక్కు గలదని అతని పక్షాన నిలబడ్డారు. అంతేగాక తూర్పిండియా కంపెనీ నిజాముతో ఒక ఒప్పందం కుదుర్చుకుంది. మహారాష్ట్రులతో గూడ యుద్ధంలో ప్రమేయం కల్గించుకునేలా చేసింది.

రెండో మైసూరు యుద్ధంలో శ్రీరంగ పట్టణాన్ని పట్టుకున్న జనరల్

మెడోస్ మద్రాసు గవర్నరుగా నియమితుడై ఈ వ్యవహారాన్ని రాజీగా పరిష్కరించుకోవాలని టిప్పు చేసిన ప్రయత్నాలను త్రోసిపుచ్చాడు. ఆ విధంగా 3 వ మైసూరు యుద్ధం అనివార్యమైపోయింది.

మొదట 1768 లో జరిగన తొలి ఒడంబడిక ప్రకారం మహారాష్ట్రులు ప్రత్యేకమైన సంధి ఏర్పాట్లు జరిగాలని వాంఛిస్తూ వచ్చారు. మహారాష్ట్రులపై ఎలాంటి దురాక్రమణకు పాల్పడబోమని యింగ్లీషువారు హామీ యివ్వాలని నిజాం కోరింది. యిది చాలా సున్నితమైన సమస్య. అందువల్ల కారన్ వాలీస్ దీనిని నిరాకరిస్తూ 1790 జూలై నాల్గున ఒక సంధి పత్రంపై సంతకం చేసాడు. అంతే గాక కారన్ వాలీస్ యితర మహారాష్ట్ర ప్రభువులతో కూడా, అంటే భోన్స్లే, సింధియా. హోల్కర్ మొదలైన వారిని యింగ్లీషువారితో చేరవలసిందిగా అభ్యర్థించాడు. అంతే గాకుండా టిప్పుకు ప్రతికూలంగా నానాను, నిజాంను చేరవలసిందిగా ఒత్తిడి చేసాడు. ఇక మలబార్ లోగల సంస్థానాధీశులు తమ ప్రభువైన టిప్పుపై తిరుగుబాటు చేయవలసిందిగా వారిని రెచ్చగొట్టాడు. చివరకు ఆ విధంగా కొచ్చిన్ రాజా ఒక అంగీకారానికి రావలసి వచ్చింది. బ్రిటీష్‌వారి మద్దతుకు గాను తగినంత ధనం చెల్లించటానికి టిప్పు ఆధిపత్యాన్ని అంతమొందించటానికి అంగీకారానికి వచ్చారు. అదే విధంగా కొన్ననూరు, కూర్గు రాజా, మైసూరు రాణి వీరంతా టిప్పుకు వ్యతిరేకంగా ఇంగ్లీషు వారితో చేతులు కలిపారు. ఆ విధంగా టిప్పుకు ఒక బలమైన ప్రతికూల వర్గం ఏర్పాటయింది. దానియొక్క ప్రధాన లక్ష్యం అప్పటికే ఏకాకియైన టిప్పును ఓడించటమే.

ఇలా జరిగిన కుట్ర ఫలితంగా అప్పటివరకు తటస్థంగా వున్న ఇంగ్లీషు వారి విధానం హఠాత్తుగా మారిపోయి, స్వదేశీ రాజుల స్వంత వ్యవహారాలలో తాము జోక్యం కల్గించుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇండియాలో బ్రిటీష్‌వారు నిలదొక్కుకొని తమ రాజ్య విస్తరణను కొనసాగించటానికి యిది నాంది అయింది.

మంగుళూరు సంధిని రద్దు చేసే అవకాశం వచ్చింది బ్రిటీష్‌వారికి.

దక్షిణాదిన టిప్పు బలమైన శక్తిగా రూపుదిద్దుకోవటం యింగ్లీషువారికే మాత్రం యిష్టంలేదు. కాగా నిజాం మహారాష్ట్రులు కూడ టిప్పుతో చేరిపోతారేమో నన్న భయం బ్రిటీష్ వారికుంది. ఏ విధంగా చూసినా టిప్పు తమకు కొరకురాని కొయ్యగా వుంటూ ఎన్నెన్నో చిక్కుల్ని తెచ్చి పెడ్తున్నాడు. బ్రిటీష్‌వారి ఎత్తు



కన్ననూర్, కూర్గు రాజా, మైసూరు రాణి ఇంగ్లీష్‌వారితో చేతులు కలుపుట.

గడల ఫలితంగా మహారాష్ట్రులు టిప్పు వ్యతిరేక కూటమిలో ఎలాగైతేనేం చేరారు. ఇంకా అప్పటికి మహారాష్ట్రి భూభాగం యెంతగానో టిప్పు అధీనంలో వుంది. ఆ భూభాగాన్ని తిరిగి రాబట్టుకోవాలని 1786 నుంచి వారు చేస్తూ వచ్చిన ప్రయత్నాలు ఫలించలేదు. 1787 ప్రారంభంలో టిప్పుకు వ్యతిరేకంగా ఒక కూటమి యేర్పడా లన్న కారన్ వాలీస్ ప్రతిపాదనను వెంటనే నానా అంగీకరించాడు. అందుకు అవ

సరమైన ఒక పథకాన్ని కూడ తయారు చేసారు. సింధియాపై నానాకు గల విరోధం కూడా యిందుకొక కారణమైంది.

సింధియా ఉత్తరాదిన గొప్ప పలుకుబడి కల్గి వున్నాడు. మహారాష్ట్రి శిబిరంలో ప్రాబల్యానికై లోలోపల కుట్రలు జరుపుతున్నాడు కూడా. నానా ఆంక్ష లను, ఆశయాలను వమ్ముచేయాలని సింధియా రాజకీయ చతురతతో ఆలోచించిన పథకం. అది 1786-87 మధ్య మహారాష్ట్రి యుద్ధానికి దారితీసి వారి గౌరవ ప్రతి ష్ఠల్ని అడుగంటేలాగా చేసింది. ఒక దశలో నానా భారతదేశాన్ని మొత్తం తాను జయించేటట్లు, అందుకు ఇంగ్లీషువారు తగు సహాయం అందజేసేటట్లు అభ్యర్థిస్తూ, యింగ్లీషువారి వద్దకు ఒక రాయబారిని కూడ పంపాడు. యింగ్లీషువారి బలం, వారికి గల వనరులు, వారి రాజనీతిజ్ఞత, సైన్యంలోగల క్రమశిక్షణ-వీటిని గురించి నానాకు బాగా తెలుసు.

ఎప్పుడైతే మహారాష్ట్రిలు టిప్పు వ్యతిరేక కూటమిలో చేరారో, అప్పుడు నిజాంకు కూడా ప్రత్యామ్నాయం కనిపించలేదు. ఆ విధంగా వారు కూడా ఆ కూటమిలో చేరిపోవలసి వచ్చింది.

ఇంగ్లీషువారు, నిజాం, మహారాష్ట్రిలు ఇలా ముగ్గురు ఏకంకావటంలో రాజకీయ పరమైన స్వార్థం యెవరికి వారికి వుంది. యీ కూటమిని చీల్చి, ఎవరికి వారు వేరుగా వుండిపోయేటట్లు చెయ్యాలని టిప్పుసుల్తాన్ యెంతగానో ప్రయత్నిం చాడు. పూనాకు తన ప్రతినిధుల్ని పంపించాడు. తాను చెల్లించవలసిన కప్పం బకాయిల క్రింద సంచుల కొద్ది బంగారం కూడ పంపించాడు. అయినప్పటికి ఏమీ ప్రయోజనం లేకపోయింది.

1790 మే 24 న యుద్ధం ప్రజ్వరిల్లింది. టిప్పు అకస్మాత్తుగా కర్నాటక లోని గజల్‌హట్టి కనుమపై దాడి చేసాడు. అలా దండయాత్ర చేసి మెడోస్, మాక్సువెల్, మైసూరుపై దాడి చెయ్యకుండా నిరోధించగల్గాడు. ఈ యుద్ధం తొలి దశలో టిప్పు యీ మిత్ర కూటమిని జయప్రదంగా నిరోధించటంలో సఫలీకృతు

డయ్యాడు. కారన్ వాలీసు కొలది మాసాలలోనే యుద్ధం ఫలితంగా తమ ఆర్థిక వ్యవస్థ యెంతగానో దెబ్బ తిన్నదని అంగీకరించాడు. జనరల్ మెడోస్ నాయకత్వాన గల బ్రిటీష్ సైన్యానికి టిప్పు అవసరమైన సరఫరాలు అందకుండా చేశాడు. దానితో యింగ్లీషు వారికి యెంతో అసౌకర్యం కల్గింది.



కారన్ వాలిస్ స్వయంగా 1791 లో మైసూరుపై దాడి చేసాడు.

టిప్పు ఆ విధంగా యింగ్లీషు వారిని నిరోధించి తనంతట తాను కర్నాటకలో ప్రవేశించాడు. ఈ పరిస్థితిలో కారన్ వాలీస్ స్వయంగా సైన్యాధిపత్యం స్వీకరించి 1791 ఫిబ్రవరి 5 న మైసూరుపై దాడి చేసాడు. అంతేగాక మిత్ర సైన్యాలన్నీ బెంగుళూరులో సమావేశం కావాలని ఆదేశించాడు. అతడు మార్చి 5న బెంగుళూరుకు వచ్చేటప్పటికి టిప్పు పుదుచ్చేరి సమీపంలో వున్నాడు. టిప్పు తన ముఖ్యమైన దుర్గాన్ని రక్షించుకోవటానికి వెళ్ళి యెంతగా ప్రయత్నించినప్ప

టికి నిరోధించలేకపోయాడు. అదే సమయంలో అటు నిజాం, ఇటు మహారాష్ట్రులు కూడా ఆదరా బాదరాగా యింగ్లీషువారితో చేరిపోయారు. ఆ రీతిగా మైసూరు వుత్తరానగల టిప్పు తాలూకు అనేక దుర్గాలు యెంతో కష్టం మీద ఈ త్రి రాజ్య కూటమి స్వాధీన పరచుకోగల్గింది.

కారన్ వాలీస్ సైన్యాధ్యక్ష పదవి చేపట్టిన వెంటనే టిప్పు సంప్రదింపుల ద్వారా సమరాన్ని అంతమొందించటానికి మరొకమారు ప్రయత్నించాడు. అయితే కారన్ వాలీస్ నుంచి తగిన ప్రోత్సాహం లభించలేదు. అప్పుడు టిప్పు పుదుచ్చేరి వద్దగల ఫ్రెంచి గవర్నరును ఆహ్వానించటం జరిగింది. ఏమైనప్పటికి 1791 మధ్య నాటికి యింగ్లీషు సేనలకు యెంతగానో నష్టం వాటిల్లింది. వాతావరణం సరిగా లేకపోవటం, సైనికులు విపరీతమైన అలసటకు లోనుగావటం, అంటు వ్యాధులు తలయెత్తటం, ధాన్యం మున్నగు ఆహార పదార్థాలు అందకపోవటం వీటన్నిటివల్ల బ్రిటీష్వారు యెంతగానో యిక్కట్లపాలు గావలసి వచ్చింది. అప్పుడు కారన్ వాలిస్ శ్రీరంగ పట్నం నుండి వెనుదిరిగి బెంగుళూరు వెళ్ళిపోయాడు.

ఈ పరిస్థితులను అవకాశంగా తీసుకొని మరొకమారు టిప్పు రాజీ సంప్రదింపులకు ప్రయత్నించాడు. కాని అవి కూడా విఫలమయ్యాయి. ఈ సంప్రదింపులు భగ్నం కావటంతో యింగ్లీష్వారు తమ ప్రాబల్యంకోసం మళ్ళీ తీవ్ర ప్రయత్నాలు సాగించారు. ఈ సందర్భంలో పరశురాం భావూ అనే మహారాష్ట్రి నాయకుడు నిజాం స్థావరాల్ని పట్టుకొని యెంతగానో ప్రతిఘటించిన మీదట వాటి నుంచి వైదొలగటం జరిగింది. అప్పుడు టిప్పు ఫ్రెంచివారి సహాయ సహకారాలకై ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది.

1792 లో వర్షాకాలం అయిపోయిన వెంటనే యింగ్లీష్వారు తిరిగి ప్రతిఘటించటం ప్రారంభించారు. వారు మళ్ళీ అనేక దుర్గాలను చేజిక్కించుకుని, శ్రీరంగపట్నం దిశగా మళ్ళీ పురోగమించసాగారు. 1792 ప్రారంభంలో టిప్పు

రాజధాని వెలుపల పరిసర ప్రాంతాలలో మోహరించి వున్నాడు. అప్పుడు కారన్ వాలిస్ 22 వేల సైనిక దళంతోనూ, 44 తుపాకులతోనూ యింకా భారీయెత్తున మందుగుండు సామాగ్రితోనూ పురోగమించాడు. ఒక్క రోజు కూడా ఆలస్యం కాకుండా టిప్పుపై దాడి చెయ్యటానికి కారన్ వాలిస్ నిర్ణయించుకోగా సరిగ్గా ఆ రోజుననే టిప్పు శ్రీరంగపట్నం సమీపానికి వచ్చాడు. ఆ విధంగా అర్ధరాత్రివేళ అకస్మాత్తుగా మూడు వైపుల నుంచి యింగ్లీషు సైన్యం టిప్పుసుల్తానుపై పడింది. కారన్ వాలిస్ బ్రిటీష్ సైనిక దళానికి స్వయంగా నాయకత్వం వహిస్తున్నాడు. ఆ యుద్ధం అత్యంత భీకరంగానూ, భయానకంగాను సాగింది. టిప్పు సైన్యాలు తమ కోటలోకి వుపసంహరించుకునేలా చెయ్యగల్గారు యింగ్లీషువారు. ఖచ్చితమైన విజయంతో యుద్ధం పరిసమాప్తమయింది. తెల్లవారేసరికి టిప్పు శిబిరం యావత్తూ యింగ్లీష్‌వారి అధీనంలోకి వచ్చింది.

యింగ్లీష్ సైన్యం కావేరీ నదిని దాటి లాల్‌బావ్ సమీపానగల దీవిలో కొంత భాగాన్ని ఆక్రమించుకొంది. అయితే ప్రధానమయిన దుర్గం అప్పటికి టిప్పు అధీనంలోనే వుంది. దాంతో యింగ్లీష్‌వారు తుఫాన్‌లా ఆ దుర్గంపై విరుచుకుపడ్డారు.

అప్పుడు టిప్పుకు రెండే రెండు ప్రత్యామ్నాయాలు కనిపించాయి. శత్రు మూకలకు లొంగిపోవటమో, లేదా ప్రాణం పోయేంతవరకు పోరాడటమో. పరిస్థితులన్నీ తనకు ప్రతికూలంగా వున్నట్లు టిప్పు గ్రహించాడు. ఇంకా అప్పటికీ శాంతి నెలకొంటుందేమోనని ఎంతగానో ఆశించాడు. తిరిగి శాంతి గనక నెలకొంటే ఏదో రకంగా తాను పొందిన నష్టాలను పూడ్చుకోవచ్చు. అతను కోయంబత్తూరు వద్ద పట్టుకున్న ఖైదీలను విడుదల చేసాడు. అంతేగాక కారన్ వాలిస్‌కు శాంతిని వాంఛిస్తూ ఒక లేఖను కూడ వ్రాసి పంపాడు.

టిప్పుసుల్తాన్ శాంతి ప్రతిపాదనను అంగీకరించటమా, లేక త్రోసి పుచ్చటమా అనేది కారన్ వాలిస్‌కు యెంతో కష్టమైపోయింది. తుదకు అతడు

దానిని అంగీకరించాడు. అయితే టిప్పు అధికారాన్ని కొనసాగేటట్లు చేస్తే రాజకీయంగా ఎప్పటికైనా తమకు ముప్పు తప్పదని బ్రిటీష్‌వారు గ్రహించారు. అందువల్ల యెంతో బలీయమయిన షరతులపై సంధికి అంగీకరించటానికి కారన్ వాలిస్ సిద్ధపడ్డాడు. టిప్పు తాను స్వాధీనపరచుకున్న భూభాగాల్ని తిరిగి అప్పగించాలని, టిప్పు కుమార్లు యిద్దర్నీ వదలిపెట్టినందుకు గాను మూడు కోట్ల రూపాయలు



టిప్పు సుల్తాన్ పంపించిన శాంతి ప్రతిపాదన లేఖ

యివ్వవలసిందిగాను, అలాగే నష్ట పరిహారం క్రింద మరొక ఎనిమిది కోట్ల రూపాయలు చెల్లించవలసిందిగాను కారన్ వాలిస్ డిమాండ్ చేశాడు. ఈ షరతులను సడలించేటట్లు చెయ్యటానికి టిప్పు యెంతో ప్రయత్నించాడు. కాని కొంతలో కొంత బ్రిటీష్ కోర్కెలకు తల ఒగ్గవలసి వచ్చింది.

ఆ విధంగా యీ మూడవ యుద్ధంలో టిప్పు పరాజితుడైనాడు. తన శత్రువులు తానుకున్న దానికంటే యెక్కువగా ప్రయోజనం పొందారు. ఈ సంధి మూలంగా టిప్పు అపారమైన నష్టానికి గురి కావలసి వచ్చింది. దీనివల్ల ఆర్థిక వనరులు, భూభాగం పంపిణీ చేయటం జరిగింది.

హైదర్ తలయెత్తిన లగాయితూ మైసూరు ఇప్పుడు నష్టపోయినంతగా యెప్పుడూ నష్టపోలేదు. మైసూరు పులిగా పేరు గాంచిన హైదర్ తన పంజా ముడుచుకొని లొంగిపోవలసి వచ్చింది. విదేశీ అధికార విస్తరణను ఏ విధంగాను అరికట్టడం సాధ్యం కాలేదు. అంతేగాక సైనికంగా కూడ తన పేరు ప్రతిష్ఠలకు యెంతగానో నష్టం వాటిల్లింది. దిండిగల్‌ను స్వాధీనపరచటం సారవంతమయిన దిమోబ్ జిల్లాలను దత్తం చెయ్యటం తన రాజ్యానికి ధాన్యాగారంగా పేరు పొందిన ప్రాంతాలను వదులుకోవటం— యివన్నీ కూడ అపారమైన నష్టాలుగానే భావించవచ్చు.

## 6. తెల్లవారలను తరిమి వెయ్యాలి.

ఇంగ్లీషు-మైసూరు సంబంధాలు శ్రీరంగపట్నం సంధి జరిగిన దాది శాంతియుతంగానే వుంటూ వచ్చాయి. ఇండియాలో లార్డ్ వెల్లస్లీ వచ్చేటంతవరకూ ఇదే పరిస్థితి కొనసాగింది.

ఇక ఇప్పుడు టిప్పు యుద్ధాలవల్ల సంభవించిన నష్టాలను భర్తీచేసుకోవటానికి ధ్వంసమయిన దుర్గాలను మరమత్తులు చేయించటానికి పూనుకున్నాడు. అయితే ఒకప్రక్క బ్రిటిష్‌వారు కొట్టినదెబ్బ అతని గుండెల్లో శల్యమై బాధిస్తూనే వుంది. వారిని యెప్పటికీ అతను క్షమించలేదు, వారితో సమాధానపడనూలేదు. యుద్ధం ముగిసిన వెంటనే అతని పరిపాలనా వ్యవహారాలన్నిటినీ శోధనంచెయ్యటం మొదలుపెట్టాడు. సైన్యం, నౌకాదళం, వర్తకం, వాణిజ్యం. ఇలా ప్రతి రంగంలోనూ అనేకానేక మార్పులుచేసి పరాజయంవల్ల తనకు కలిగిన మచ్చలను

తుడిచి వేసుకోవటానికి యెన్నో విధాల ప్రయత్నించాడు. అలాగే శాంతి సామరస్యాల ద్వారా తన నష్టాల్ని పూడ్చుకోవటానికి ప్రయత్నం చేసాడు. కొన్ని సరిహద్దు ప్రాంతాలను సర్దుబాటు చేసుకోవటానికి యింగ్లీషువారు బలవంతాన ఆక్రమించుకున్న వైనాడ్‌ను తిరిగి చేజిక్కించుకోటానికి ప్రయత్నాలు జరిగాయి.



టిప్పుసుల్తాన్ నిర్మాణ కార్యక్రమములు చూచుట

అలాగే అనుకున్న ప్రకారం బ్రిటిష్ అధికారి సర్ జాన్ 1794 మార్చిలో తాము పట్టుకొన్న ఖైదీలను విడుదల చేసాడు. భారతీయ ప్రభువుల మధ్య తలయెత్తిన వివాదాలలో ప్రత్యక్షంగా జోక్యం కల్గించుకోకుండా, ఇంగ్లీషవారు యెంతో జాగ్రత్తగా తటస్థ విధానాన్ని అనుసరిస్తూ వచ్చారు.

ఇది ఇలా వుండగా యీ మధ్యకాలంలో కుర్దులావద్ద మహారాష్ట్రుల చేతుల్లో నిజాం పరాజితుడు కావటం, పీష్వా రెండవ మాధవరావు మరణించటం.

అలాగే రెండవ బాజీరావు, దౌలత్‌రావు సింధియాలు అధికారంలోకి రావటం, ఇంగ్లీషువారు తటస్థ విధానాన్ని అవలంభించటం ఇవన్నీకూడ టిప్పుసుల్తాన్ తాను కోల్పోయిన ప్రతిష్టను తిరిగి సంపాదించటానికి తోడ్పడ్డాయి. 1795లో దక్కన్ పీఠభూమి నాయకత్వం విషయమై మహారాష్ట్రులకు, ఇంగ్లీషువారికి మధ్య పోరాటం జరిగింది. మరొక రకంగా చెప్పాలంటే ఇది మహారాష్ట్ర- నిజాం యుద్ధం.

ఇప్పుడు టిప్పు యుద్ధాలలో జోక్యం కలిగించుకునే స్థితిలో లేడు. ఎవతోనైనా యుద్ధం సాగించాలనికూడా అతననుకోలేదు. తన స్వదేశాన్ని తిరిగి చక్కపెట్టుకోవటమే అతని ప్రథమ కర్తవ్యం. దానితోబాటు వ్యవసాయం, వాణిజ్యం అభివృద్ధి చేసుకొని. తగినంతగా వనరులు సమకూర్చుకొని ఇంగ్లీషువారిని దేశం నుంచి తరిమికొట్టటానికి తిరిగి యుద్ధం చెయ్యాలన్నదే అతని లక్ష్యం. అంతే గాని. తన రాజ్యాన్ని భూభాగాలను మరింతగా విస్తృత పరచుకోవాలన్న కాంక్ష అతనికే కోశాన్నలేదు సాధ్యమైనంతవరకు యుద్ధాలలో పూర్వం తాను పోగొట్టుకున్న నష్టాల్ని భర్తీ చేసుకోవాలని మాత్రం అతడు వాంచించాడు.

చుట్టూవున్న రాజ్యాలు ప్రతిసారి తనకు వ్యతిరేకంగా పోరాడినప్పటికి వారందరూ ఏకమైనప్పటికి తాను ఒంటిగానే పోరాడదలచాడు. అందుకుగాను దేశంలోను. దేశం వెలుపలా, తనకు సహాయపడే మిత్రులకోసం ఎదురుచూసాడు. ఐతేఅతను చేస్తూ వచ్చిన ప్రయత్నాలు ఏ విధంగాను ఫలించలేదు.ఇంతకుముందు ఫ్రెంచివారతనికెంతో సహాయపడ్డారు ఇప్పుడు కూడా ఫ్రాంసులో నాయకత్వం మారితేవారు సహాయపడగలరనే అతనివిశ్వాసం. ఆ విధంగా తూర్పు ప్రాంతంలో ఇంగ్లీషువారు లేకుండా చెయ్యాలని అతడు కోరాడు. అతను అనుసరించిన వైఖరి యేమాత్రం తప్పుకాదు. ఎందుచేతనంటే ఫ్రెంచివీరుడు నెపోలియన్ అప్పటికే ప్రాచ్యంపై కన్నులేసాడు. అయితే దురదృష్టం కాచుకొని కూర్చుంది. అది యెప్పుడు ఎవరిపట్ల మొగ్గుతుందో ఎవరూ చెప్పలేరు. అటు నెపోలియన్, ఇటు

టిప్పుకూడా మధ్య ప్రాచ్యంలో అండకోసం చేసిన ప్రయత్నం ఫలించలేదు. అదిఫలించినట్లయితే చరిత్ర మరొక విధంగా వుండేది. ఏమయినా టిప్పుసుల్తాను చిత్తశుద్ధిని యేమాత్రం శంకించటానికి వీలులేదు. బ్రిటిష్‌వారు భారతదేశంలో సుస్థిర స్థానం సంపాదించరాదని అతడు శతవిధాలు ప్రయత్నించాడు. కాలం ఖర్మం కలిసిరాక అతడి అంచనాలు తారుమారై కథ అడ్డం తిరిగింది.

## 7. తుది ఘట్టం

టిప్పుసుల్తాను యొక్క కార్యకలాపాలు బ్రిటిష్‌వారు యెప్పటికప్పుడు వేయికళ్ళతో కనిపెట్టుకుంటూ వచ్చారు. ఏ క్షణంలోనయినా అతని మూలంగా తమకు పెను ప్రమాదం ముంచుకొని వస్తుందని వారనుకున్నారు. అయితే టిప్పుసుల్తానుమాత్రం ఇంగ్లీషువారిని యేమాత్రం తీవ్రంగా రెచ్చకొట్టలేదు. మారిషస్ నుంచి అతనికి సహాయం అంతగా లభించలేదనే చెప్పాలి. జమాన్‌షాతో సంబంధాలు పెట్టుకోవటం ద్వారా యెదురైన ప్రమాదంకూడ పూర్తిగా తొలగిపోయింది. అయినప్పటికి వెల్లస్లీ మైసూరుపై దాడి చేసాడు. అందుకు కారణాలు అనేకం. వాటిల్లో ముఖ్యమైంది ఇండియాపట్ల బ్రిటిష్ విధానం పూర్తిగా మారిపోవటం. వెల్లస్లీ వచ్చిం తర్వాత వారు స్వదేశీయులతో సమానులుగా వుండరాదన్న నిర్ణయానికి వచ్చారు. అంతేగాక స్వదేశీ సంస్థానదీశులు తమకు తొత్తులుగా లొంగి వుండాలని కోరారు. ఇది చాల అవమానకరమైన విషయం. అందువల్ల స్వదేశీ రాజులకు. ఇంగ్లీషువారికి సంఘర్షణ తప్పలేదు ముఖ్యంగా టిప్పుసుల్తాను యీ అవమానకర పరిస్థితికి ఏమాత్రం తల ఒగ్గలేకపోయాడు. బ్రిటిష్‌వారు స్వదేశీ సంస్థానాదీశులను ఒకరి తర్వాత ఒకర్ని తొలగిస్తారని తుదకు తమకు పాదాక్రాంతులాగా చేసుకుంటారని టిప్పుసుల్తానుకు బాగా తెలుసు. అత్యంత ప్రమాదకరమైన యీ పరిస్థితిని తన ప్రాణాలు ఒడ్డియైనా సరే ప్రతిఘటించాలని టిప్పు నిర్ణయించుకున్నాడు. ఏటికి ఎదురీదటం మొదలుపెట్టాడు. అనేక విధాల సంపన్నమయిన

యింగ్లీషువారితో తాను ఒంటరిగా పోరాడటం సాధ్యం కాదని అతనికి పూర్తిగా తెలుసు. అయితే మాతృదేశం పరిరక్షణకు తుదకు ప్రాణాలయినా సరే బలిపెట్ట డానికి అతడు సిద్ధమయినాడు.



వెలస్లీ వచ్చింతర్వాత బ్రిటిష్ విధానాలు పూర్తిగా మారిపోవడం

1797 అక్టోబరులో లార్డ్ మార్నింగ్‌టన్ గవర్నరు జనరల్‌గా నియమితుడైనాడు. అతడు యిండియాకు 1798లో వచ్చాడు. టిప్పుసుల్తాను మర్యాదపూర్వకంగా అతనికి అభినందనలు తెలుపుతూ లేఖ వ్రాసాడు కూడ. అయితే ఆ తర్వాత స్వల్పకాలానికే టిప్పు సుల్తానును ధ్వంసం చెయ్యటానికి లార్డ్ మార్నింగ్‌టన్ సిద్ధపడ్డాడు.

అంతకు ముందు వెల్లస్లీ కూడా టిప్పుపై దెబ్బ తీయడానికి ప్రయత్నించాడు. కాని ఆ సమయంలో మించిపోయింది. ఇప్పుడు లార్డ్ మార్నింగ్టన్ బ్రిటీష్‌వారికి ప్రధాన ప్రతినిధి అయినాడు. ఈసారి టిప్పుసుల్తానుతో యుద్ధానికి ప్రధాన కారణం మారిషస్‌లో టిప్పు రాయబారిని నియమించటంగాని, అలాగే ఈజిప్టుపై నెపోలియన్ సైన్యాలు దాడి చెయ్యటం కాని కారణం కానేకాదు. ఏమైనా ఇండియాలో బ్రిటిష్ అధికారాన్ని విస్తరింప చేసుకోవాలన్న వెల్లస్లీ కాంక్ష వల్లనే ప్రధానంగా ఇప్పుడు టిప్పుతో యుద్ధం సంభవించిందని చెప్పవచ్చు. ఈ యుద్ధంలో విజయం పొందితే ఈస్టిండియా కంపెనీకి అనేక ప్రయోజనా లున్నాయి. పైగా వెల్లస్లీ ప్రతిపాదించిన షరతులు యెంతో కఠినంగా వున్నాయి. ఏ విధంగానైనాసరే టిప్పును నామ రూపాలు లేకుండా చెయ్యలన్నదే ఆ షరతుల సారాంశం. కాగా న్యాయమైన వారి కోర్కెలను అంగీకరించటానికి టిప్పు సంసిద్ధంగానే వున్నాడు. ప్రధానంగా తనను సర్వతంత్ర స్వతంత్ర పరిపాలకుడుగా అప్పటికీ గుర్తించాలన్నదే టిప్పుసుల్తాను ప్రధాన కోర్కె.

1798 జూన్ 20 వ తేదీన వెల్లస్లీ టిప్పుసుల్తాన్‌పై యుద్ధం చెయ్యటానికే నిర్ణయించుకున్నాడు. తీర ప్రాంతాలన్నింటినే పట్టుకొని టిప్పు రాజధానికి పురోగమించవలసిందిగా తన సేనలకు ఉత్తర్వు జారీచేసాడు. యుద్ధానికి గాను అయ్యే ఖర్చులకుగాను కొంత సొమ్ము చెల్లించవలసిందిగా వెల్లస్లీ కోరాడు. కాని ఆ మొత్తం యెంతో ఖచ్చితంగా చెప్పలేదు. పరస్పర సంప్రదింపుల ద్వారా దాన్ని నిర్ణయించుకోవాలని చెప్పాడు. అంతేగాక సర్వీస్‌లో వున్న ఫ్రెంచివారి నందరిని తొలగించి వెయ్యాలని టిప్పుసుల్తానును పట్టుబట్టాడు. ఆ ప్రకటన ప్రతులను అటు పూనాకు, యిటు నైజాంకు కూడా వారి సహాయ సహకారాలను కోరుతూ పంపాడు.

వెల్లస్లీ మొట్టమొదట నిజామును లొంగదీసుకున్నాడు. అచ్చట ఫ్రెంచి జనరలైన రేమాండ్ ఆధీనంలో 14 వేలమంది సైనిక దళం వుంది. అది

కనిపెట్టి వెల్లస్లీ నిజాంతో శాశ్వతంగా ఒక సంధి చేసుకున్నాడు. ఆ విధంగా నిజాం వెచికంగా బ్రిటిష్‌వారి చేతిలో వుపగ్రహంగా వుండిపోవటానికి నిర్ణయించుకున్నాడు. ఈ సంధి పత్రంపై 1798 సెప్టెంబరు ఒకటిన సంతకాలు జరిగాయి. దాని ప్రకారం హైదరాబాదులోని ఫ్రెంచి దళాలు తొలగించబడ్డాయి. వారిస్థానంలో 6 వేల మంది బ్రిటిష్ సైనికులు గల ఒక దళం కర్నల్ రాబర్ట్సు నాయకత్వాన నిజాంలో అధికారంలోకి వచ్చింది. ఆ విధంగా వెల్లస్లీ అటు ఫ్రెంచి దళాలను



బ్రిటిష్ దళం కర్నల్ రాబర్ట్ నాయకత్వాన నైజాంలో అధికారంలోకి వచ్చింది.

తొలగించడం, యిటు టిప్పుసుల్తానుకు వ్యతిరేకంగా తమ పక్షానికి తిప్పుకోవటం- యిలా రెండు ప్రయోజనాల్ని సాధించగలిగాడు. అయితే ఇక్కడొక విషయం గమనించాలి. మహారాష్ట్రను తన పక్షాన త్రిప్పుకోలేకపోయాడు వెల్లస్లీ. నిజాంతో కుదుర్చుకున్న సంధి లాంటిదే ఒక సంధి కుదుర్చుకోమని బ్రిటీష్‌వారిపై వత్తిడి

తెచ్చాడు. అప్పుడు నానా 25 వేల మంది సైనిక దళాలను పంపించటానికి తన సంసిద్ధతను తెలియజేసాడు. మహారాష్ట్ర నుంచి చురుకుగా మద్దతును కోరక పోయినప్పటికి వారు తటస్థంగా వుండిపోతే చాలునని అనుకున్నాడు వెల్లస్లీ.

ఈ విధంగా బ్రిటీష్‌వారు రాజకీయంగా సాగించిన ఎత్తుగడల వల్లనైతే నేమి, రాజకీయ చతురతవల్ల నైతేనేమి టిప్పును ఏకాకిగా చెయ్యటం జరిగింది. అంతట నిజాంకు విధించిన షరతులతోనే ఒక షరతుల పత్రంపై టిప్పును సంతకం చెయ్యవలసిందిగా వెల్లస్లీ కోరాడు. ఈ సంధి పత్రంపై అవమానకరమగు షరతు లతో కూడిన ఈ ఒడంబడికను ఆమోదించటానికి టిప్పు ఏమాత్రం అంగీకరించ లేదు. దాన్ని అంగీకరిస్తే టిప్పుసుల్తాను తన స్వాతంత్ర్యానికి నీళ్ళు వొదులుకో వలసిందే. అప్పుడు వెల్లస్లీ సంధి పత్రంపై సంతకం చెయ్యకపోతే మానారు. తీర ప్రాంతంలోని జిల్లాలను స్వాధీనపర్చవలసిందిగా టిప్పును కోరాడు.

ఈ ఎత్తుకడలన్నీ తనను పూర్తిగా మట్టుబెట్టడానికి, తన రాజ్యాన్నంతటినీ చేజిక్కించుకొనడానికి చేస్తున్న ప్రయత్నమేనని టిప్పుకు తెలియకపోలేదు. ఇదిలా వుండగా మరొక వైపున ఇంగ్లీషువారు తమ బలాన్నన్నిటినీ కూడగట్టుకుని టిప్పును దెబ్బ తీయడానికి పొంచి వున్నారు. 1799 జనవరి 9 న వెల్లస్లీ టిప్పుకు ఒక లేఖ వ్రాసాడు. రెండు రోజులలోగా ఆ లేఖకు సమాధానం పంపవలసిందిగా కోరాడు. టిప్పుసుల్తాన్ తన సమాధాన్ని మద్రాసుకు పంపే లోపుగానే వెల్లస్లీ మైసూరుపై దాడి చేశాడు. 1799 ఫిబ్రవరి 3 న హేరిస్ మద్రాసు నుంచి బయలు దేరాడు. అతనికి సహాయంగా రాజకీయ వ్యవహారాలు చర్చించటానికి ఒక కమీషన్ కూడా ఏర్పటయింది. హేరిస్‌కు తోడుగా బొంబాయి నుంచి జనరల్ స్టూఆర్టు నాయకత్వాన కొంత సైన్యం బయలుదేరింది. శ్రీరంగపట్టణాన్ని పట్టుకోవాలన్నదే వారి ఆకాంక్ష.

ఇంగ్లీషు సైన్యాలు ఫిబ్రవరి 11 న నెల్లూరు నుంచి బయలు దేరాయి. అందులో 4000 మంది యూరోపియన్లు, 20 000 మంది సిపాయిలు వున్నారు.

యుద్ధరంగంలో పాల్గొన్న ఇంగ్లీషువారి సేనలన్నింటిలోకి అదే పెద్దది. నిజాం మరో 16 000 మంది సైన్యాన్ని తీసుకువచ్చాడు. బొంబాయి సైన్యంలో 6,000 మంది వున్నారు. మరో 5,000 మంది సైనిక దళంతో కర్నల్ రీడ్, కర్నల్ బ్రౌను నాయకత్వాన దక్షిణాది నుంచి వచ్చింది. ఒక్క కంపెనీ సైన్యాలే 30,000 మందికి పైగా వున్నారు. ఈ 3వ మైసూరు యుద్ధం చాలా భయంకరమైంది.



శత్రు సేనలు కారన్ వాలిస్ నాయకత్వాన శ్రీరంగపట్టణానికి 15 మైళ్ళ దూరంలోకి వచ్చాయి.

టిప్పుసుల్తాను అటు బొంబాయినుంచి, ఇటు మద్రాసు నుంచి సైన్యాలు తన రాజధాని వైపు పురోగమించకుండా ప్రతిఘటించాలని ప్రయత్నించాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. అప్పటికి శత్రు సేనలు కారన్ వాలిస్ నాయకత్వాన శ్రీరంగపట్టణానికి తూర్పున 15 మైళ్ళ దూరంలోకి వచ్చాయి. ఏప్రియల్

5 న శ్రీరంగపట్టణం కోటను ముట్టడించటం ప్రారంభమయింది. ఏప్రిల్ 20 న సంధి సంప్రదింపులను తాము ఆకాంక్షిస్తున్నట్లు టిప్పు తెలియజేసాడు. అయితే అతని కోర్కెను బ్రిటీషువారు మన్నించలేదు. ఏప్రియల్ 25 న టిప్పు రక్షక వలయాన్ని ధ్వంసం చెయ్యటానికి నాల్గు శతఘ్నులను పేల్చటం జరిగింది. ఏప్రియల్ 27న ఇంగ్లీషు దళాలు కోటలోనికి చొచ్చుకుని రానే వచ్చాయి. అప్పుడు కూడా టిప్పుసుల్తాన్ అస్వతంత్రుడైన ఫించన్ పుచ్చుకునే నవాబుగా వుండటంకంటే గౌరవప్రదమైన యోధుడుగా మరణించటమే మేలు అనుకున్నాడు.

పరిస్థితులన్నీ అతనికి ప్రతికూలంగా వున్నాయి. అంతే కాకుండా టిప్పు మంత్రులలోనే కొందరు ఇంగ్లీషువారితో చేతులు కలిపి మిత్ర ద్రోహానికి పాల్పడ్డారని కొందరంటారు. అలాంటి మంత్రులలో మీర్ సాదిక్ ఒక్కడు. మే 4 న టిప్పుసుల్తానుపై దాడి జరుగుతుందని అతనికి తెలిసే వున్నట్లు చెపుతారు. టిప్పుసుల్తాను సర్వీస్‌లో వున్న యే ఇతర ముస్లింకు లభించని గౌరవం, సదుపాయాలు యీ యుద్ధం తర్వాత బ్రిటీష్ వారివల్ల అతనికి లభించినట్లు చెపుతారు. ఆ ఘోర రణంలో అర్ధరాత్రి ఒంటిగంట వేళ టిప్పుపై దారుణమైన దాడి జరిగింది. వీర విక్రమంతో టిప్పుసుల్తాను శత్రువులతో పోరాడుతూ మాతృభూమి కోసం అహర్నిశలు పాటుపడుతూ వచ్చిన యోధాగ్రేశ్వరుడు శత్రుమూకల చేతుల్లో వీర మరణం పొందాడు.

స్వతంత్ర భారతంకోసం ప్రాణాలు అర్పించిన యీ మహా వీరుడు అమర వీరుడుగా చరిత్రలో ప్రసిద్ధి గాంచాడు. యింగ్లీషువారు మనదేశంలో అధికారాన్ని హస్తగతం చేసుకోకుండా ఎల్లప్పుడు పోరాడిన భారతీయ ప్రభువు టిప్పు ఒక్కడు మాత్రమే. అతని మరణంతో ఇండియాలో వారు తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకోవటానికి గల అడ్డంకులు అవరోధాలు అన్నీ తొలగిపోయి నట్లయినాయి. శ్రీరంగపట్టణాన్ని చేజిక్కించుకోగానే వారు సమధికోత్సాహంతోను, సంతోషంతోనూ ఇక భారతదేశం మనదే అంటూ కేకలు పెట్టారట. ఆ

విధంగా బ్రిటీష్ సామ్రాజ్యం ఇండియాలో గట్టిగా వేళ్ళూనుకున్నది. అంతేకాదు, ఇండియాలో సాగిన యీ నాల్గవ మైసూరు సంగ్రామం బ్రిటిష్ సామ్రాజ్య చరిత్ర లోనే ఒక మైలురాయి లాంటిది. ఈ యుద్ధంతో హైదరాలీ, టిప్పుసుల్తానుల వంశ పరంపర పరిసమాప్తమైంది.



యుద్ధంలో పాల్గొన్న ప్రభువుల మధ్య అభిప్రాయ బేధాలు తలెత్తాయి.

ఇల్లలుకగానే పండుగ కాలేదన్నట్లు టిప్పుసుల్తాన్ పతనమైనప్పటికి విజేతలు అనేక క్లిష్ట సమస్యలు యెదుర్కోవలసి వచ్చింది. సుసంపన్న మైన యీ దేశ సంపదను కొల్లగొట్టాలని అందరూ కాచుకొని కూర్చున్నారు. కాగా యితర రాజ్యాలవారు అసూయా ద్వేషాలతో ఉడికిపోతూ వచ్చారు. అనుకున్న ప్రకారం యుద్ధంలో పాల్గొన్న ప్రభువుల మధ్య సంపద పంపిణీ విషయంలో అభిప్రాయ బేధాలు తలయెత్తాయి టిప్పు కుమారులను పూర్తిగా తుడిచిపెట్టివేయటం జరిగింది.

తండ్రి మరణంతో వారు రాజకీయంగా విదేశీ యాధికారానికి బానిసలై పోయారు. యుద్ధంలో పాల్గొన్న ప్రభువుల మధ్య రెండు ఒడంబడికలు జరిగాయి వీటి ప్రకారం మైసూరు రాజాకు కొన్ని లక్షల రూపాయలు విలువజేసే భూభాగాన్ని అప్పచెప్పటం జరిగింది. అలాగే కొన్ని లక్షల రూపాయలు నిజాంకు అప్ప గించటం జరిగింది. తూర్పు ఇండియా కంపెనీకి వచ్చిన భాగం మాత్రం అందరి కన్న చాలా ఎక్కువ. నిజాంకు వచ్చింది అందరికన్నా చాలా తక్కువ. ఇక



టిప్పుసుల్తాన్ మొలలో వజ్రాల బాకును దొంగిలించిన ఇంగ్లీషువారు

మహారాష్ట్రుల విషయంలో వారు స్వల్ప లాభంతో యింగ్లీషువారితో చేరిపోవటానికి ఒప్పుకున్నారు. ఈ పంపిణీపట్ల నిజాముకు ఏ మాత్రం తృప్తిలేదు. కాని యేం చేస్తాడు? పరిస్థితులు అలా వచ్చాయి.

ఏదియేమయినా ఒకటి మాత్రం అక్షరాల నిజం. ఒక నక్కలాగా

నూరేండ్లు జీవించడం కన్న మృగరాజు సింహం లాగా ఒక్క రోజు జీవించటం మేలని భావించాడు టిప్పుసుల్తాను. అవక్ర విక్రముడు, అజేయుడు అయిన టిప్పు సుల్తానులాంటి శత్రువును యింతకు ముందు ఇంగ్లీషువారు ఎప్పుడూ యెదుర్కొని ఎరుగరు.

టిప్పు వీర మరణం పొందిన సమయంలో అతని మొలలో ఒక ఖైజార్ (ఖడ్గం) వున్నట్లు చెప్తారు కొందరు. ఆ కరవాలం పిడిపై 'చంద్రకాంత మణి' దగ ధగ్గాయమానంగా ప్రకాశిస్తూ ఉండటం చూచారట కొందరు వీకులు. ఆ మణిని ఒక యింగ్లీష్ వాడు సంగ్రహించటం కొందరు వీరులు చూచారట. ఆ మణి ఉన్న వారు పూర్వం కూడా యెవరూ బ్రతికి బట్ట కట్టలేదని, టిప్పుసుల్తాను కూడా దానికి బలి అయ్యాడని అంటారు. కోహినూరు వజ్రం లాగానే అపూర్వమైన ఈ మణిని కూడా బ్రిటిష్‌వారు వశం చేసుకున్న కథలున్నాయి.

## 8. టిప్పు సుల్తాను పరిపాలన దక్షత

టిప్పుసుల్తాన్ తన రాష్ట్ర పరిపాలనా వ్యవహారాలపట్ల యెంతగానో శ్రద్ధా భక్తులు చూపినట్లు అర్థమౌతుంది. ఒక ప్రభువులాగా ఏనాడు హాయిగా భోగాలతో తులతూగుతూ విశ్రాంతి తీసుకున్న పాపానపోలే దాయన. ఎప్పుడూ యెంతో వుత్సాహంతో తన శక్తినంతా వినియోగించి శ్రమిస్తూ వచ్చాడు. అదంతా కూడా రాష్ట్రం యొక్క, రాష్ట్ర ప్రజల యొక్క అభ్యున్నతి, సంక్షేమాల కోసమే.

పరిపాలనా వ్యవహారాలను గురించి అధికారులతో నిరంతరం, ఎప్పటి కప్పుడు వుత్తర, ప్రత్యుత్తరాలు జరుపుతుండేవాడు టిప్పు. అన్ని సమస్యల పైన ముఖ్యంగా పౌర, సైనిక, వర్తక, వాణిజ్యాల, శాంతి భద్రతల విషయాలలో వారికి తగు సూచనలు ఇస్తుండేవాడు. అంతే కాకుండా పాశ్చాత్య పరిపాలనా పద్ధతులలో

గల సుగుణాలను కూడా టిప్పు అనుసరిస్తూ వచ్చాడు. తన సాయుధదళాల్ని పునః వ్యవస్థీకరించాడు.

పంచాగాల్ని సవరించాడు. తుకాలు బరువులలో క్రొత్త పద్ధతులు ప్రవేశపెట్టాడు. వర్తక వాణిజ్యాలలో, రెవిన్యూ, న్యాయస్థానాలలో ఎన్నెన్నో క్రొత్త క్రొత్త ప్రయోగాలు ప్రవేశపెట్టాడు. పట్టణాలు, నగరాలలో సృజనాత్మకమైన పరిపాలనా విధనాలను ఆధునీకరించాడు. ప్రాచ్యంలోని ప్రభువులలో టిప్పు సుల్తాన్ అన్ని విధాల సమర్ధుడని అగ్రగణ్యుడని చెప్పవచ్చు.

టిప్పుసుల్తాన్ ముస్లిమ్ అయినప్పటికి అన్ని మతాల వారిని సమానంగా చూస్తూ వచ్చాడు. అతని పరిపాలనా కాలంలో హిందూ ముస్లిమ్‌ల మధ్య కలహాలు కాని, మత విద్వేషాలు కాని ఎన్నడూతలయెత్తలేదు. మతమూ, విశ్వాసాలు, సాంప్రదాయాలు- వీటి విషయంలో అటు హిందువులకు గాని అటు మహ్మదీయులకుగాని ఏమాత్రం నొవ్వకుండా వారి వారి సాంప్రదాయాలను, ఉత్సవాలను కొనసాగించుకునేటట్లు చూసాడు. మతసహనానికి, మత సామరస్యానికి టిప్పుసుల్తాన్‌ది పెట్టిందిపేరు, హైదరాలి కాలంలో తన నాణేలలో శివపార్వతుల బొమ్మలను అట్టిపెట్టి వుంచాడు. అయితే టిప్పు యీ నాణెలను కొంతమార్చి వాటిని మొహరీలగాను, రూపాయలుగాను ప్రవేశపెట్టాడు. టిప్పు కాలంలో వెండి నాణాలు తొలిసారిగా జారీ అయ్యాయి.

కేంద్ర ప్రభుత్వంలో మొదట 18 విభాగాలు వుండేవి అందులో పౌర వ్యవహారాలు రెండు అత్యంత ప్రధానమైన శాఖలు ఒకటి ఆర్ధికం రెండు పోలీసు బలగం. అధికారాన్ని యావత్తు టిప్పు తనచేతుల్లోనే కేంద్రీకృతం చేసాడు. తన సొంత ప్రధానమంత్రిని, విదేశాంగ మంత్రిని సర్వసైన్యాధ్యక్షుణ్ని నియమించుకున్నాడు. ఎప్పటికప్పుడు వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు.

ప్రజల సంక్షేమాన్ని గురించి యెన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాడు. అంతేగాదు. టిప్పుసుల్తాన్ సంఘ సంస్కర్తగా కూడా కీలకపాత్ర వహించాడు. ఉదాహరణకు అతని కాలంలో మద్యపానాన్ని నిషేధించడం జరిగింది. అలాగే పడుపు వృత్తికూడ నిషేధించాడు. మలబారులో బహుభార్యాత్వాన్ని నిలిపివేసాడు. స్త్రీలందరూ తప్పనిసరిగా ముసుగును ధరించాలని దేహాల పైభాగాన్ని



కేరళ స్త్రీలందరూ విధిగాపైన వస్త్రధారణం చేయాలని ఆదేశించడం

సక్రమంగా వస్త్రంతో కప్పుకోవాలని ఆజ్ఞాపించాడు. ఆ రోజుల్లో మలబారులో స్త్రీలు కొందరు తమ శరీరాలపై నడుము పైభాగం నుంచి ఎలాంటి వస్త్రం కప్పుకోరు. అంతేగాక తరతరాలుగా వస్తున్న పంచాయితీ వ్యవస్థను అతడు మరింత పటిష్టం చేసాడు. టిప్పు రాజ్యంలో వ్యవసాయం, వాణిజ్యం, పరిశ్రమలు యెంత

గానో అభివృద్ధి చెందాయి. కనుకనే అతని పాలనలో అన్ని వర్గాల ప్రజలు సుఖ సంతోషాలతో జీవించగలిగారు.

ఒక్కమాటలో చెప్పాలంటే టిప్పు జనరంజకంగా పరిపాలించిన ప్రభువని చెప్పవచ్చు. అటు మొగలాయీల దగ్గర, ఇక్కడ యింగ్లీషు, ఫ్రెంచి వారి దగ్గర ధనం అప్పు తీసుకోవటంలో యెంతో జాగ్రత్తవహించింది ప్రభుత్వం. అతని ప్రభుత్వశాఖలను 18 నుంచి 7కు తగ్గించాడు.

ప్రతిశాఖకు ఒక ప్రధానాధికారి వుండేవాడు. ఆ శాఖ పని తీరును గురించి ఎప్పటికప్పుడు రికార్డుచేసి పెట్టేవాడు. ఇలా అన్నిశాఖల ప్రధానాధికారులు వెల్లడించిన అభిప్రాయాలను టిప్పు సలహాదారుల సంఘమొకటి పరిశీలించి మెజారిటీ అభిప్రాయాన్ని తీసుకునేవాడు.

హైదరాలీ కాలంలో కూడ రెండురాష్ట్రాల గవర్నర్‌ల పదవులుండేవి. ముఖ్యంగా అవి బీదనూరు, మలబారు. టిప్పు కాలంలో అతను తన రాజ్యాన్ని 7 రాష్ట్రాలుగా విభజించాడు. ఆ తరువాత 9 రాష్ట్రాలకు పెరిగింది. ఇంకాతర్వాత 17 రాష్ట్రాలుగా మారింది. 1794లో అతని రాష్ట్రాల సంఖ్య 37కు పెరిగి పోయింది. ప్రతి రాష్ట్రానికి ఒక సివిల్ గవర్నరు, ఒక మిలిటరీ గవర్నరు వుండే వారు. సివిల్ గవర్నరు, రెవిన్యూ వ్యవహారాలను, మిల్రిటీ గవర్నరు శాంతి భద్రతలను పర్యవేక్షించేవారు. ఇక గ్రామాలు పటేళ్ళు, పాన్‌బాగ్‌ల ఆధ్వర్యంలో వుండేవి. పటేళ్ళు ఆయా గ్రామాలలో కావలసిన రోడ్లు, ఇతర సదుపాయాలు, అక్కడి శాంతి భద్రతలు, వివాదాలు చూసేవారు. శాంతి భద్రతల విషయంలో అతని పరిపాలన యెంతో కట్టుదిట్టంగా వుండేది. శ్రీరంగపట్టణం నుంచి పర్షియన్, కన్నడ, మరాఠీ యీ మూడుభాషలు అమలులో వుండేవి. ప్రతి గ్రామంకూడ ఒక చిన్న రిపబ్లిక్‌లాగా వుండేదంటే మనకు ఆశ్చర్యం కల్గుతుంది. అక్కడ

సర్వాధికారాలు పలేలుదే. రివెన్యూ వ్యవహారాలలో టిప్పుకు అపారమైన పరి జ్ఞానం వుండేది. భూమి శిస్తు విషయంలో యెంతో జాగ్రత్త వ్యవహరించేవాడు. రైతులకు యెలాంటి కష్టం కలగకుండా శిస్తు విధించటం, ఆ శిస్తును సక్రమంగా వసూలయ్యేలా చూడటం జరుగుతుండేది. మెట్టపల్లాలకు పంటలో మూడవ వంతు, మాగాణి భూములకు, నదులద్వారా చెరువుల ద్వారా సాగుకాబడే భూములకు పంటలపై సగభాగం శిస్తుగా వసూలు చేసేవాడు.

హైదరాలి, టిప్పుసుల్తానుల కాలంలో సముద్ర తీరప్రాంతాల్ని కూడ వారెన్నడు అలక్ష్యం చెయ్యలేదు. హైదర్ కాలంలో 1764లో మొదటిసారిగా రేవు ప్రాంతాల్ని యేర్పాటు చేయటం జరిగింది. కాని ఆ తర్వాత అనేక యుద్ధాలు సంభవిస్తూ రావటంతో నౌకా వాణిజ్యం దెబ్బతిన్నది. అయితే టిప్పుసుల్తాను మాత్రం వర్తక వాణిజ్య విషయాలలో యెంతగానో శ్రద్ధాశక్తులుచూపి, వాటి అభివృద్ధికి శాయశక్తులా కృషిసల్పాడు. ముఖ్యంగా మిరియాలు, మిరపకాయలు, గంధపుచెక్క, యాలకులు, బియ్యం మున్నగు వస్తువుల యెగుమతిని టిప్పు ఎంత గానో ప్రోత్సహించాడు. ముఖ్యంగా బెంగుళూరు వర్తక వాణిజ్యాలకు ముఖ్య కేంద్రంగా వుండేది. ప్రతిరోజూ రమారమి 200 ఎడ్లబండ్లతో సరుకు మైసూరు సరిహద్దుల నుండి కేరళకు వెళుతూ వుండేది, యుద్ధాలే కనక సంభవించక పోయి నట్లయితే టిప్పు ఒక పారిశ్రామిక విప్లవాన్ని లేవనెత్తేవాడు. అంతేకాకుండా అమూల్యమైన ఖనిజాలు, ఏనుగులు, కలప, బంగారం, పొగాకు మున్నగునవన్నీ అపారంగా ఎగుమతి అవుతూ యెంతో ధనాన్ని ఆర్జించిపెట్టేది. వాణిజ్య విష యంలో ప్రజలు యెంతో శ్రద్ధ చూపేటట్లు టిప్పు కృషిచేసాడు అన్ని విధాల వారిని ప్రోత్సహిస్తూ అన్ని రకాల సదుపాయాలు కలుగజేస్తూ వచ్చాడు. ప్రతి రంగంలోనూ గుత్తాధిపత్య ధోరణుల్ని అరికట్టడానికి కూడ అతడు ప్రయత్నిం చాడు. టర్కీ, ఫ్రాంసు ఇరాన్ మున్నగు ఇతర ప్రదేశాలనుంచి వృత్తి కళా

కావుల్ని ఆహ్వానించాడు. శ్రీరంగపట్నం, బెంగుళూరు, చిత్రదుర్గా, బీదనూరు మొదలయిన ప్రదేశాలలో కత్తెరలు, గాజు గ్లాసులు, తుపాకులు, కాగితం, గడియారాలు మొదలయినవి తయారు చెయ్యటానికి అనేక కర్మాగారాలను నెలకొల్పాడు. అందాక యెందుకు; ఒక్క శ్రీరంగపట్టణంలోనే ఒక కాగితం మిల్లు వుండేది. తుపాకీమందు, స్టీలువైరులు, సంగీత సాధనాలు మైసూరులో తయారయ్యేవి. మైసూరియన్లు మేలురకం చక్కెర తయారు చెయ్యటంలో తోడ్పడటానికి చైనీయుల్ని ఆహ్వానించాడు. బెంగుళూరులో నేత పనివారు సున్నితమైన వెండి జరీ వస్త్రాలను తయారు చేసేవారు. హైదరాలీ, టిప్పుకూడా రోడ్లు, కోటలు దుర్గాలు, ఉద్యానవనాలు ఏర్పాటుచేసి, అటు బస్తీలు, ఇటు నగరాలు కూడ తీర్చి దిద్దటానికి యెంతగానో తోడ్పడ్డారు.



చైనీయుల సహకారంతో బెంగుళూరులో నేతపని కర్మాగారాలు స్థాపించుట

శ్రీరంగపట్టణంలో "దరియాదౌలత్" అనే ఒక వేసవి విడిది ప్యాలెస్ వుండేది. అలాగే బెంగుళూరులోగల ప్రసిద్ధమైన లాల్‌భాగ్ హైదరాలీ ఏర్పాటు చేసిందే. నీటి పారుదల సౌకర్యాలు. చెరువుల, తటాకాల కరకట్టలను బాగు చేయించటం ఒక ప్రత్యేక కార్యక్రమంగా వుండేది. టిప్పు ఒక డామునుకూడా నిర్మించాడు. ఆ స్థలంలోనే ఇప్పుడు కృష్ణరాజసాగర్ డాం నిర్మాణమయింది.

ఇక సైన్యం విషయానికివస్తే హైదరాలీ కాలంలో మొదటి మైసూరు యుద్ధం సమయమప్పుడు వారి సైన్యం దాదాపు 30 వేలు. 2వ మైసూరు యుద్ధం నాటికి అది దాదాపు 55 వేలకు పెరిగింది. టిప్పుసుల్తాను యోధాన యోధుడే గాక యుద్ధ తంత్రంలో యెంతో నిపుణుడు. పదాతి దళాన్ని, ఆశ్వికదళాన్ని అసాధారణమైన సామర్థ్యంతో టిప్పుసుల్తాను నడపగలిగాడు. అతని కాలంలో అనేక రకాలనౌకల నిర్మాణం కూడ జరిగింది. ఓడలు దోపిడీ దొంగల బారి పడకుండా కట్టుదిట్టమయిన రక్షణ యేర్పాట్లు చేసాడు టిప్పు.

ఇక్కడ మరొక ప్రధానమయిన విషయం పేర్కొనవలసివుంది. టిప్పు సుల్తాను మత సహనానికి పెట్టింది పేరుగా ప్రసిద్ధికెక్కాడు. హిందూ ముస్లింల సఖ్యతకు సామరస్యానికి యెంతగానో కృషిసల్పాడు. అన్ని మత విశ్వాసాలను అతను గౌరవిస్తూ వచ్చాడు. అన్ని వర్గాలను సమానంగా చూస్తూ వచ్చాడు. అటు దేవాలయాలలో పూజల్ని గాని, యిటు మసీదులో ప్రార్థనలు గాని, అతని పరిపాలనలో యెలాంటి ఆటంకం లేకుండా జరిగిపోయేది. 1774లో రంగనాథ స్వామి ఆలయంలో కొంతభాగం అగ్ని ప్రమాదానికి ఆహుతి అయినప్పుడు ప్రభువు హైదరాలీ ఒక్కమాసంలో దాన్ని పునర్నించ గలిగాడు. దీన్నిబట్టి హైదరాలిగాని, టిప్పుసుల్తాన్‌ల పాలన అని ఎవరనగలరు? టిప్పుసుల్తాను శృంగేరి శంకరస్వాములవారికి. వారి హయాంలో శారదాదేవి ఆలయం, విగ్రహంకూడ పిండారీల దోపిడీకి ధ్వంసకాండకు గురికాగా అప్పుడు టిప్పు శృంగేరి స్వామికి

స్వయంగా ఉత్తరాలు వ్రాసి హిందూమతం పట్ల తనకు గల గౌరవ ప్రవృత్తిని భక్తి విశ్వాసాలను ప్రకటించుకున్నాడు. అంతేగాక శృంగేరి ఆలయం మరమ్మత్తుకు కావలసిన ద్రవ్యసహాయంకూడ అందజేసాడు. తనరాజ్యం సుభిక్షంగా కొనసాగాలని భగవంతుణ్ని ప్రార్థించవలసిందిగా ఆయన స్వామినికోరాడు. అలాగే విగ్రహ ప్రతిష్ఠాపన అనంతరం దైవప్రసాదం, శాలువలు శృంగేరి నుంచి టిప్పుకు అందాయి. టిప్పుసుల్తాను తిరిగి ఆ శాలువలను అమ్మవారికి కానుకగా సమర్పిం



తనసు ప్రజలను కాపాడమని ప్రార్థన చేయమని శృంగేరీ పీఠాధిపతిని వేడుకొనుట

చటం జరిగింది. అంతేగాక టిప్పు రెండు పల్లకీలను శృంగేరికి పంపించాడు. అందులో ఒకటి అమ్మవారికోసం, రెండవది స్వామివారి కోసం. ఈ ప్రకారంగా టిప్పు సుల్తాను యెంతగానో మత సామరస్యాన్ని పాటించి అందరి మన్నలను అందుకున్నాడు. టిప్పు ఆజ్ఞానుసారమే నంజన్‌గూడ్‌వద్ద నంజన్‌గూడేశ్వర అనే

పేరుతో ఒక శివలింగాన్ని (మరకత లింగాల్ని) ప్రతిష్ఠించటం జరిగింది. రంగ నాథస్వామి ఆలయంలో గంటలమోత రాజభవనంలో వున్న టిప్పుకు యెప్పుడూ వినిపిస్తూవుండేది. మసీదులో ప్రార్థనల పిలుపులాగా అది అతని చెవుల పడ్తూం డేది. రాజ ప్రాసాదానికి సమీపంలోనే నరసింహస్వామి, గంగాధరేశ్వరస్వామి ఆలయాలుండేవి. వాటిలో పూజలు, నిత్యనైవేద్య దీపారాధనలు జరుగుతుండేవి. ఇలాంటి దైవ కార్యక్రమాలు ఎంతో ప్రశాంతంగా తన సామ్రాజ్యంలో కొన సాగుతున్నందుకు టిప్పుసుల్తాను యెంతగానో సంతోషించాడు.

టిప్పు నేరస్తులను శిక్షించటంలోకూడా ఎన్నెన్నో కొత్త ప్రయోగాలు చేసాడు. జిల్లాలో రైతులెవరన్నా నేరాలకు పాల్పడితే వాళ్ళకు ప్రభుత్వం జరి మానా విధించేది. మరికొందరికి జరిమానా గ్రామ పొలిమేరలో కొన్ని చెట్లను నాటించేటట్లు చేసేవాడు. ఆ దేశంలో పర్యటించిన వారంతా వ్యవసాయ పనులలో ఎంతో చక్కగా సాగుతున్నాయని ప్రజలంతా యెంతో కష్టపడి పనిచేసేవారని మొత్తంమీద ప్రజలలో ప్రతి ఒకరూకూడ సుఖసంతోషాలు వెళ్ళి వెరుస్తుండే వని పేర్కొన్నారు. ఇదంతగా కూడా టిప్పు ప్రభుత్వం గొప్ప తనమేనని చెప్ప వచ్చు. రాష్ట్ర పరిపాలనా వ్యవహారాలను అతడు స్వయంగా చక్కపెట్టేవాడు. మిత్రులు, నమ్మకస్తులయిన యితర సలహాదారులు తగుమాత్రంగా అతనికి సహాయం చేసేవారు టిప్పు హృదయం యెంతో కళాత్మకమైంది. కళలంటే అతని కెంతో ఆసక్తి. అతనికి గల కళాసక్తి అతని నాణేలమీద, అతడు నిర్మాణం చేసిన దేవాలయ గోపురాలమీద, చూడవచ్చు, ముఖ్యంగా భూమికి నీటి పారుదల విషయంలో అతడు ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ వచ్చాడు. వాణిజ్య వ్యాపారాల ఎగుమతులకు యెంతో విస్తృతమయిన యేర్పాట్లుండేవి. వర్తక సంబంధమయిన 9 మంది కమీనర్‌లతో ఒక ప్రభుత్వం బోర్డును ఏర్పాటు చేశాడు. ఆ బోర్డు క్రింద దేశంలోని 30 ఫాక్టరీలు, అలాగే 17 విదేశీ కర్మాగారాలు పనిచేస్తూ

వుండేది. వాణిజ్యంవల్ల, నౌకా వాణిజ్యంవల్ల, మైసూరు యెంతో సంపన్నమవుతూ వచ్చింది.

## 9. ముగింపు

భారతదేశ చరిత్రలో టిప్పు సుల్తాను పాత్ర ఒక విధంగా సాటిలేనిదని చెప్పవచ్చు. మాతృదేశమంటే అతనికి అంతులేని ప్రేమ, భక్తి, గౌరవం. అలాగే స్నేహితులన్నా పడి చచ్చేవాడు. ఎప్పుడూ ప్రశాంతంగా, నిదానంగా వుండేవాడు. ఆచి, తూచి మాట్లాడేవాడు. ఏ పనిచేసినా నిర్ణీతకాలంలో ఒకానొక నియమబద్ధంగా చేసేవాడు. చాలమంది అనుకొన్నట్లుగా స్వతహాగా అతడు క్రూరుడు కాడు. దయామయుడు, ఉదారుడు. ఎట్టొచ్చీ తన అధికారాన్ని పడగొట్టటానికి కుట్రపన్నేవారంటేనే అతనికి మంట. వారిని బద్ధ శత్రువులుగా పరిగణించి వారిపై యెంతో కఠినంగా చర్యలు తీసుకునేవాడు. అందువల్ల టిప్పుసుల్తాను క్రౌర్యాన్ని గురించి చరిత్రకారులు గోరంతలు కొండంతలు చేస్తూ వచ్చారు. అతని సైన్యం ఎప్పుడూ యెంతో క్రమశిక్షణతో వ్యవహరిస్తూ వుండేది. పతనమయ్యేవరకు అతని సైన్యం ప్రజారక్షణకు పెట్టని కోటగా వుంటూ వచ్చింది. ప్రజలకు టిప్పు మద్దతు ఇచ్చినంతగా మరే ప్రభుత్వం ఎప్పుడూ ఎన్నడూ యివ్వలేదు. ప్రజల

అండదండలతోనే టిప్పునిరంతరం అనేకానేకయుద్ధాలు చెయ్యగలిగాడు. స్వయంగా యోధుడు, అసమానమైన ధైర్య స్థయిర్యాలు కలవాడు కావుననే యుద్ధరంగంలో అతడి వీరవిక్రమాలు బహుముఖంగా ప్రదర్శితమౌతూ వచ్చాయి. 3వ మైసూరు యుద్ధ సమయంలో అటు నైజాం, ఇటు మహారాష్ట్రులపై అతడు సాగించిన మెరుపుదాడులు, సైనిక వ్యూహాలు చరిత్ర యెన్నటికి మర్చిపోలేదు.



టిప్పుసుల్తాన్ స్వయంగా ఎన్నో గ్రంథాలు రచించినాడు

తండ్రి హైదరాలీ వలెగాక టిప్పుసుల్తాన్ బహుభాషాకోవిదుడు. అనేక విషయాలలో తగినంతగా పరిజ్ఞానం కలవాడు. ప్రధానంగా సూఫీమత సిద్ధాంతాలను అతను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నాడు. అదీగాక ఆ సిద్ధాంతాలను

గురించి స్వయంగా ఎన్నో గ్రంధాలు రచించాడు కూడ. విజ్ఞానశాస్త్రం, వైద్య శాస్త్రం, మతం, కళలు, సైనిక వ్యవహారాలు మున్నగు విషయాల గురించి ఎన్నో గ్రంధాలు రచించాడు. టిప్పుకు తెలియని విషయమంటూలేదు. ప్రాచ్యాన్ని పరిపాలించిన ప్రభువులలో టిప్పులా పరిపూర్ణ జ్ఞానంగల ప్రభువులు ఎవరూలేరని పాశ్చాత్యులు తమ గ్రంధాలలో పేర్కొన్నారు. అతని మనస్సు ఎప్పుడు చురుకుగా వుండేది. ఆతనిలాగా సృజనాత్మకశక్తి, అసాధారణ ధృక్పధం, యెప్పటికప్పుడు క్రొత్త విధానాలను గురించి క్రొత్తగా కనిపెట్టే ప్రజ్ఞ— వీటి గురించి టిప్పుసుల్తాన్ మరో అక్బరు చక్రవర్తిలాంటి వాటిని ప్రశంసిస్తూ వచ్చారు. కొన్ని వర్తక వాణిజ్య ప్రయోగాల విషయంలో టిప్పు ఆశ్చర్యకరమైన ప్రయోగాలను ప్రవేశపెట్టాడు. కరెన్సీ నాణాలు, బరువులు, తూకాలు, బ్యాంకు వ్యవస్థ, రెవెన్యూ, న్యాయవ్యవస్థ, సైనిక, నౌకా విభాగాల విషయంలో టిప్పు చేసిన కృషి గణనీయమైనది. టిప్పు హయాములో నౌకా నిర్మాణం యెంతో గొప్పగావుండేది. ఆ విషయంలో మైసూరును గురించి అప్పటిదాక ఎవ్వరికీ తెలీదు. టిప్పు మైసూరు నౌకా వాణిజ్యానికి గాను, వాణిజ్య సంబంధమైన నౌకలు నిర్మించి తీరప్రాంతంలోనే యిలాంటి నౌకా వ్యవస్థలేదని అనుకునేలాగా చేయగలిగాడు. నౌకా నిర్మాణ యార్డులు మూడువుండేవి అతనికాలంలో. అలాగే నౌకాదళ వుద్యోగులకు, సిబ్బందికి తగు శిక్షణ యిచ్చే నిమిత్తం ఒక స్కూలుకూడ వుండేది. ఏమైనా టిప్పు హయాంలో మైసూరు అన్ని విషయాలలోనూ సుసంపన్నమై యెన్నో విధాల ప్రగతిని సాధించగలిగింది.

ఇక్కడ మరొక ముఖ్యమైన విషయాన్ని చెప్పవలసివుంది. టిప్పుకు హిందూ సాధువులన్నా, దేవతలన్నా, యెంతో భక్తి గౌరవాలుండేవి. శృంగేరి శంకరా స్వాముల వారికి స్వయంగా అతడు వ్రాసినలేఖలు యిందుకు నిదర్శ నాలు. అలాగే హిందూ జ్యోతిష్కులను కూడా ఎప్పటికప్పుడు అతను సంప్ర



టిప్పుకు హిందూ సాధువులన్నా స్వాములన్నా ఎంతో గౌరవ ప్రపత్తులుండేవి

దిస్తూ, వారి సలహాలను, సూచనలను పాటిస్తూ వచ్చాడు. బ్రాహ్మణులకు యెన్నో సంతర్పణలను చేసాడు. హిందూ మత సంబంధమైన ఉత్సవాలకు, దేవాలయ అభివృద్ధికి టిప్పు యెంతో వుదారంగా గ్రాంట్లు మంజూరుచేస్తూ వచ్చాడు. అతని

యొక్క శతృవులు మాత్రమే టిప్పు ఒక వున్మాదిలాంటి వాడని పేర్కొనటం జరిగింది.

కూర్కులోనూ, మలబారులోనూ, హిందువులను, నయనార్లను అతడు నిర్దాక్షిణ్యంగా అణచివేసిన మాట నిజమే. కాని యిందుకు తగిన రాజకీయ కారణాలు వున్నాయి. వారు యింగ్లీషు వారితో చేతులో కలిపి టిప్పు ప్రభుత్వం పట్ల ద్రోహానికి, కుట్రకు పాల్పడ్డారు. అలాంటి ప్రయత్నాలు సాగించినందుకే కర్నూలు నవాబులాంటి వార్ని టిప్పు కఠినంగా శిక్షించటం జరిగింది. మహారాష్ట్రులకన్నా నిజామంటేనే టిప్పుకు బద్ధవైరం. బ్రిటిష్‌వారి పై ఖరికాని, వారి ప్రవర్తన కాని, రాజ్య విస్తరణకోసం వారు పన్నే ఎత్తుగడలను గురించిగాని మొదటినుంచి టిప్పు తీవ్ర వ్యతిరేకతను కనబరుస్తూ వచ్చాడు. ఇంగ్లీషువారి ప్రాబల్యంతో భారతీయ సార్వభౌమాధికారానికి ముప్పు వాటిల్లునట్లు ముందుగానే గ్రహించి టిప్పుసుల్తాన్ వారిపట్ల ఎంతో జాగరూకతతో వ్యవహరిస్తూవచ్చాడు. బ్రిటిష్‌వారి కబంధహస్తాల నుంచి భారతదేశాన్ని తప్పించాలన్నదే టిప్పు ఏకైక లక్ష్యం అందుకోసమే అతను జీవితాంతం ఆఖరు రక్తపుబొట్టు నేలపై రాలే వరకు బ్రిటిష్‌వారితో పోరాటం సాగించి ఒక మహావీరుడుగా, అకలంక దేశభక్తుడుగా తుదకు రణభూమిలో వీరమరణం పొంది చరిత్రలో అమర వీరుడుగా ఖ్యాతికెక్కాడు. యింగ్లీషువారు అతని నుంచి రాజ్యాన్ని హస్తగతం చేసుకోవటంతో అతని శకం అంతమైనట్లయింది. టిప్పుసుల్తాను బ్రతికి వున్నంతవరకూ తమకు యే మాత్రం

భద్రత లేదని ఇంగ్లీషువారు భావిస్తూవచ్చారు. టిప్పు మరణాంతరం మాత్రమే వారు పెద్దపెట్టున "ఇక భారతదేశం మాదే" అనే నినాదాలు దిక్కులు పిక్కటిల్లే టట్లు చేయగలిగారు.

ఆ విధంగా టిప్పు పాలించింది కొద్దికాలమే అయినా అది బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణకు ఒక బ్రహ్మాండమైన అడ్డుగోడగా నిలుస్తూవచ్చింది. ఎవరి సహాయ సహకారాలు లేకుండానే ఏకాకిగా టిప్పు విదేశీ దురాక్రమణను ఒక పులిలాగా ఎదిరిస్తూవచ్చాడు. చివరకు సీజర్‌లాగా టిప్పు శతృవుల కుట్రకు, కుతంత్రాలకు బలికావలసి వచ్చింది. ఇదంతా కూడా స్వదేశీరాజుల మధ్య అనైక్యతే ప్రధాన కారణమని పేర్కొనవచ్చు. అంతేగాక సైనికంగాను, రాజకీయంగాను, బ్రిటీష్‌వారితో సమానమయిన శక్తి సామర్థ్యాలు భారతీయ ప్రభువులకు లేకపోయి నవి. టిప్పు తన ఆదర్శాల విషయంలో ఎన్నడూ రాజీపడలేదు. వీరోచితంగా ప్రాణాలు ఒడ్డటానికే అతడు సిద్ధపడ్డాడు కాని, ఎప్పుడూ తన లక్ష్యాల్ని పణంగా పెట్టటానికి అంగీకరించలేదు. అతడు చెప్పినట్లుగానే నక్కలాగా నూరేండ్లు బ్రతకటంకన్నా సింహంలాగా ఒక్కరోజు బ్రతికితే చాలని టిప్పుసుల్తాను నిరూపించాడు. అకలంక దేశభక్తుడుగా మాతృభూమిని ఎంతగానో ప్రేమించిన మహామనీషిగా చరిత్రలో ఎల్లవేళలా అతడు జ్ఞాపకం వుంటాడు.

— సమాప్తం —

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
,, అక్బర్ బీర్‌బల్ వినోదకథలు
,, తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
,, ఆలీబాబా 40 దొంగలు
,, అల్లావుద్దీన్ అద్భుతదీపం
,, గలివర్ సాహస యాత్రలు
,, శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
,, భట్టి విక్రమార్కుని సాహసకథలు 2భాగాలు
,, భేతాళకథలు
,, మొగల్ సామ్రాజ్య కథానాయకులు
,, ప్రవక్త మహమ్మద్
,, ఏసుక్రీస్తు కథలు
,, మదర్ థెరిస్సా
,, రవీంద్రనాథఠాగూర్
,, యోగ వేమన
,, భగత్‌సింగ్
,, అంబేద్కర్
,, యశ్‌పాల్‌కపూర్
,, భగవతీచరణ
,, సుభాస్ చంద్రబోస్
,, చంద్రశేఖర ఆజాద్
,, జయప్రకాష్ నారాయణ్
,, సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
,, పూజ్య బాపూజీ

